శ్రీరస్తు.

# దేసింగురాజుకథ.

శ్రీక్షణికాద్రిపురవరాధీశ్వరుకృపాకటాక్ష
వీక్షణాలంకార
సంగీతసాహిత్యరచనాచమత్కారులగు
రావూరు॥ వేంకటసుబ్బయ్యగారిచే
నిఖిలజనానందకరంబుగా రచియింపంబడిన
ఈ గ్రంథము.

వజ్ఝల - పాపయ్యశాస్త్రులవారిచేఁ
బరిష్కరింపఁబడి.

తంజావూరు - చిన్నకన్నయ్యశెట్టిగారికుమారుఁడు
నాగలింగప్పశెట్టిగారి గార్డియనైన
అజ్జీ - షణ్ముఖప్పశెట్టిగారి
వుత్తరవుచొప్పున
భువనగిరి॥ చెన్నకేశవులుశెట్టిగారి
జ్ఞానసూర్యోదయముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపఁబడియె.

MADRAS.

1889.

శ్రీ ర స్తు.

---

విఘ్నేశ్వర స్తుతి.

క॥ శ్రీకరప్రథమగణాకర । ప్రాకటభవభయవి
దూరపన్నగహారా । లోకానుగ్రహకారా । చేకొని
రక్షింపుమయ్య శివసుకుమారా॥ .............. ❊

శ్రీ సుబ్రహ్మణ్య స్తుతి.

క॥ శరవణభవవరసుందర । కరుణాకరదీనపోష
కామితఫలదా । వరశక్తిధారిషణ్ముఖ । సురమునిను
తధన్యగణ్యసుబ్రహ్మణ్యా॥ .................. ❊

మహేశ్వర స్తుతి.

క॥ ఇందుధరసుందరాంగా । కుందేందుచ్ఛవితు
రంగకుజనవిభంగా । బృందారకహృత్సంగా । మంద
స్మితవదనబ్రోవు స్మరహరలింగా॥ .............. ❊

శ్రీ మహావిష్ణు స్తుతి.

క॥ కమలాప్తకమలనేత్రా । కమలోద్భవవినుత
పాత్రకర్బురజైత్రా । కమలాప్తకులపవిత్రా । క్రమ
ముగరక్షించునీలకంధరమిత్రా॥ .............. ❊

బ్రహ్మదేవుని స్తుతి.

క॥ నలినోద్భవచతురానన । విలసితసృష్టిప్రకార
వేదవిధాతా । జలజాక్షునాభిపంకజ । కలితాంతర్వర్తి
దిక్ప్రకాశితకీర్తీ॥ .............................. ❊

## శ్రీలక్ష్మీ - గౌరీ - భారతులస్తుతి.

క॥ శ్రీగౌరీభారతులన్ । బాగుగ నేజాలదలతు
భక్తితో నెపుడున్। సాగిలబడినుతియించెద। వేగమె
రక్షించుకొరకు వేడుకలలరన్॥ ............... ※

గీ॥ సకలదేవతలెల్లనుసంభ్రమమున। ప్రకటితం
బుగకొనియాడిభవ్యముగను । రంగుమీరంగ జేసింగు
రాజుకథను। జెప్పెదను నేనులోకప్రసిద్ధిగాను॥ ... ※

క॥ ఇలలోగలబుధులీకృతి। గలతప్పులుదిద్దిమీరు
గాంభీర్యముగా। వెలయంజేయగవలెనని। చెలువుగ
గోరెదనుమిమ్ముసిద్ధముగాగన్॥ ............. ※

శ్రీరస్తు.

# దేసింగురాజుకథ.

## కథాప్రారంభము.

శ్రీకరముగ గణనాథుపదములు చెలువుగ సేవించి
ప్రాకటపద్మజురాణిని చాలా భక్తితో దలచి
ముదముతో హరిహరపరమేష్ఠులను మదిలో నర్చించి
సదయులైన శ్రీగౌరీవాణుల సంప్రీతితో నెంచి
వరకవులగు నా వాల్మీకాదుల వందనములు చేసి
గురుతరముగ సద్గురువులనెల్లను గొక్కిబూజ జేసి
ఈవసుధను పెరుగుమిపురవాసుడ నింపుమీర నేను
రావూర్వేంకటసుబ్బయాఖ్యుడను రంజితంబుగాను
సంతసమున దేసింగురాజుకథ చక్కగ జెప్పెదను
వింతగనీభువిలో నందరునిది విస్మయమందగను
సురపతినారదసంవాదంబిది చోద్యంబుగనిపుడు
వరుసగ నది నెట్లన్నను దెల్పెద సరవితోడ వినుడు.

(దేవేంద్రుడు కొలువై యుండగా నారదుడు వచ్చుట.)

నాకాధిపుడగు పాకారియు తానధికభోగమునను
తేకువతోడను సింహాసనమున తేజరిల్లగాను
సురగరుడోరగసిద్ధసాధ్యులు సూటిగ గొల్వగను
సరగున రంభాద్యప్సరలప్పుడు సరసత నాడగను
మురియుచు ఫణిపతులెల్లను గొడుగులు గరిమెతో పట్టగను
పరమాద్భుతముగ కిన్నెరులెల్లను మరిమరి పొగడగను
డంబుమీర తుంబురునారదులు నంబరమున బాడ

జంభఘేటికొలువునఋషులెల్లను సంభ్రమంబుతోడ
ఉండగ నారదుడొకనాడచటికి నొప్పుగానురాగా
దండిగకొలువుననుండియింద్రుడా తపసిజూచివేగ
నమ్రుండై తానర్ఘ్యపాద్యములు నతిభక్తితోనిచ్చి
సంభ్రమ మొదవగ నాతనినుచితా సనమునందునునిచి
సామిమీరలీమూడులోకములు సంచరింపబూని
భూమినిగలవింతలు దెల్పుండిపు డేమైనా గాని
వినగోరెదమీ వాక్యపద్ధతిని వీనులవేడుకగా
మనములరగ నేచోద్యములుండిన మాకు దెల్పుడీక వేగా
అనిసురపతియానందంబునన మ్మునివరునడుగగను
తనమదిబొంగుచునింద్రునితో నా తపసియిట్టులనేను.

## నారదుండు దేవేంద్రునికో దేసింగురాజుకథజెప్ప నారంభించుట

సురనాయక యొకయాశ్చర్యమువిను సొంపుమీరనిపుడు
పరువడి తెల్పగవచ్చితినీకు పరమప్రీతిని నేడు
తిరముగ భువిలో నెబదియారు దేశంబులుండ
పరమప్రసిద్ధము హైదరబాదు పురమనెగోల్కొండ
ఢిల్లీ పాచ్చా యేలుచుండెమరి సల్లలితంబుగను
ఎల్లలోకులకునధిపతియైతా నేకచ్ఛత్రముగాను
ఇంపుగనేలుచునుండగజరిగిన యితిహాసంబును నేను
సొంపుగజెప్పెదవిస్తరంబుగా చోద్యంబంతయు వినుము
అననమ్మునిశేఖరుతోనింద్రుం డప్పుడిట్టులనియెన్
మునినాయకనీపలుకులు సంతస మొసగెబల్కుమనియెన్
వినుసురనాయక భూమండలమున వెస మేరువునందు
మునులుపలువురుతపములు సేయగ ముదమొదవగనందు
ఘనుడుమహాత్ముడుగొగుపకీరీ యనువాడు తాను

మనమలరగఘనతపమును జేయుచు మంత్రతంత్రములను
తెలిసిసిద్ధుడై యుండగనచటికి దేవలోకమందుండి
విలసితబారాహజారిరాగను వెలగుతోడనుండి.

(గోగుపక్కీరి ఢిల్లికి గుఱ్ఱమును తెచ్చుట.)

మేఘమండలమునందుతిరిగెడు మేటితురంగమును
లాఘవమునబట్టగదలచియునా ఘోడాపోవగను
చూచిమంత్రతంత్రంబులచేతను చోద్యంబుగవశపరచి
ఆచిపట్టుకొనిఢిల్లికివేగమె యతిమోదంబుననడిచి
వచ్చియొక్కచోడేరావేసి పరులకుదెలియకను
అచ్చటనుండిచుట్టునుపహరా మెచ్చుగనుంచగను
అప్పుడుబారాహజారిగజన గొప్పగజేయగను
తప్పకఢిల్లిలోగలజనులందరు తడబడిమూర్ఛలను
చెందినపాచ్ఛావినియప్పుడుతా సందేహించుచును
ఇందుగలిగినప్రళయంబేమో యిది తెలియగవలెను
తొమ్మిదివేఘములొక్కటగజన తొడిబడజేసినదో
ఇమ్మహిగలుగుసముద్రములెల్లను యిటుఘోషించినదో
అనిమదినెంచుచునతివేగంబున తనతక్తుకువచ్చి
ఘనుడాబడేదివాణ్జిరాజలింగ బాబునటుగాంచి
రావోయిచింతలుగనబడె నేడు రాజలింగబాబు
రావముగలిగినదడియేమిప్పుడు రాజలింగబాబు
గజనజేసినదేమదిచెప్పుము ఘనుడలింగబాబు
భర్జింపుమునీవిప్పుడు దానిని పరగలింగబాబు
అనగావినియారాజలింగబా బప్పుడిట్టులనెను
మనవివినుమాపాచ్ఛాయిప్పుడు మరిచెప్పెదనేను
గోగుపక్కీరియనునాడటకొక గుఱ్ఱముదెచ్చెనునేడు
బాగుగదివ్యహయంబునుదెచ్చెనుపట్టుపడదుచూడు

మంత్రతంత్రముల చేతను దానిని మచ్చిడి తెచ్చినవాడు
యంత్రంబుల చేవశము జేసుకొని యిటకువచ్చినాడు
ఎంతటిధైర్యముగలవారైనను యెక్కలేరు దాని
వింతగనున్నదటన్నను పాచ్ఛా వేగచూచెదాని.

పాచ్ఛాగోగుపక్కీరికిబహుమానములిచ్చి
గుఱ్ఱమును తీసుకొనుట.

సంతోషముతోనప్పుడు పాచ్ఛా చయ్యనపక్కీరికి
కొంతధనంబును బహుమానంబులు కొల్లగనిచ్చియాపుఃకి
హయమును గొని తా తెప్పించియులాయములోగట్టించి
నయమునగోగుపకీరినప్పుడే నచటనుండియంపించి
పరువడి రాజలింగబాబును పాచ్ఛావటుచూచి
వరుసనునందరుపాళెగాండ్రను త్వరలోరప్పించి
ఈగుఱ్ఱమునెక్కినవారలకిక బహుమతులిప్పించు
బాగుగ నెక్కనివారలఖైదులో వేగమెపెట్టించు
అనిసెలవిచ్చిన రాజలింగబా బరకారుఃనంపగను
పనివడిపంపినహరకార్లేగ యనువుగజెప్పగను
వచ్చిరిహయమునుజూచుటకై యా పాళెగాండ్రందరును
మెచ్చగునా గుఱ్ఱంబునుజూచి యెక్కలేముమేమనను
అందరఖైదులో నేడువర్షను లమరగనుంచుమనెన్
యిందికనెవ్వడు రాజలింగబా బిప్పుడుతెల్పుమనెన్
మనవియొక్కటివినుమిక పాచ్ఛా మరిచెప్పెద నేను
ఘనులౌ రాజులుగలర నేకులు కనుగొనభువిలోను
ప్రవిమలమతులగు రాజులందరు పరగ యెక్కలేరు
అవితథశౌర్యులనతిశూరులుయీ హయమునెక్కలేరు
ఇప్పుడుదక్షిణదిక్కున శెంజని హెచ్చుగానుగలదు
గొప్పకోటదుర్గంబునునచ్చట నొప్పుగానుగలదు

తనరగ చెంజికోటను యేలే తరణిసింగు రాజు
తనయులు యిద్దరు శూరసింగును ధరణిసింగు రాజు
శూరసింగుడును ధరణిసింగుడును సొంపు చెంజికోట
వారలిద్దరును యేలుచుండిరి వదలక నానాట
శూరసింగునకు సమానశూరులు వేరే లేరెచట
ధీరవరుండగు ధరణిసింగునకు దీటుగాన మెచట
బహుశూరులు యీ బారహజారిన్ పటుగతినెక్కుదురు
సహజంబుగ వారిద్దరు గుఱ్ఱము చక్కనెక్కగలరు
అనగను విని హరకారుల నచటికి నతిశీఘ్రముగాను
పనివడి బంపుము రాజలింగబా బను వుమీరగాను
అంతట రాజలింగబాబు తా హరకార్లను బిలిచి
సంతసమున నా చెంజికోటకును జాబువ్రాయనెంచి
పెద్దకరణమును రంగపిల్లను బిల్వమనుచు బంచి
వద్దచేరియా రంగపిల్ల యటు పాచ్ఛావును గాంచి
సలాంచేసిన రంగపిల్లను చక్కగాను జూచి
సలాంబదులు చేసిన పిల్లను చయ్యననటు గాంచి - ఓ
రంగపిల్ల నీవిప్పుడు చెంజికి వ్రాయవలెను జాబు
సంగతులన్నియు దెలియ జెప్పెదను సరగ వ్రాయు జాబు

(శూరసింగు రాజుకు పాచ్ఛా జాబు వ్రాయుట.)

సలాం శూరసింగు రాజవో సలామయ్య నీకు
బలే శూరుడని నిమ్ము గాంచుటకు పరగ బుద్ధి మాకు
కలిగియున్నది మా పైమీద దయ కలుగవలయు నేడు
సలలితముగ రావలెనిచ్చటికిని చయ్యనను యిప్పుడు
సతతంబును రాజులనందరిని సమ్మతి జూచితిని
మతిమంతుడ నిమ్ము జూడగవలెనని మరియు పుడంపితిని
అని యీరీతిని వ్రాసి పంపుము వినయముగ రంగపిల్ల

అనినాతఁడు జాబునవ్రాసెనువిని యాసంగతులెల్ల
జాబుతెచ్చిహార్కార్పాపయతో సవిస్తరముగాను
బాబువారిగా తెలియజెప్పియట పంపువేళలోను
యేనూరామడదూరను చెంజికి యీఢిల్లికినిపుడు
పూనితపాలాగుఱ్ఱములేనూర్ పొందుగనుంచుకొని
మరిచెంజికిపోవోయినీవిప్పుడు హారకార్పాపయ్యా
చెంజికిపోయిశూరసింగునిటు తేవలెవడిగాను
రంజితమ్ముగాపోయినీవిటు రమ్ము జల్దిగాను
తడయకహార్కార్ పాపయ్యప్పుడుతపాలమార్గముగా
వడిగానప్పుడు పాతచెంజికిని వచ్చెను వేడుకగా
శూరసింగుడునుకొత్తచెంజిలో సొంపుకొల్వులోను
ధీరులయినతనమంత్రులగూడుక తేజమలరగాను
ఉన్నకొల్వునకుహార్కార్ పాపయ తెప్పునదావచ్చి
సన్నుతుడగుయాశూరసింగునుచయ్యననటుగాంచి

(హార్కార్ పాపయ్యశూరసింగునకుజాబుయిచ్చుట.)

వినయముతోహార్కార్ పాపయ్య వేడ్కసలాంజేసి
చనువుతోడయాశూరసింగునకు జాబంతటదీసి
సొంపుగనిచ్చినహారకార్నప్పుడు శూరసింగుజూచి
పెంపుతో యెవ్వరుబంపవచ్చితివి చెప్పేరేమనలేచి
అప్పుడుసలాముచేసిపల్కెను హారకార్పాపయ్యా
చెప్పెదనిప్పుడుసంగతులెల్లను చెలువుగవినవయ్యా
హెచ్చుగఢిల్లీపాచ్ఛామిమ్మున యిపుడుచూచుటకును
అచ్చటకినిమిమ్మును తెమ్మనగా వచ్చినాను నేను
జాబుచూడగానన్నిసంగతులు సవిస్తరముగాను
బాబువారిగా తెలుసును మీకు బరమముదంబునను
అనినతమ్ముడగుధరణిసింగును నంత తానుపిలిచి

తనచేజాబునుచదివి తెల్పుమని తమ్మునిచేనిచ్చి
ఇచ్చినజాబునుచదివిసంగతు లేర్పడఁ జెల్పగను
ముచ్చటవినియాకొలువునజనములు మురియుచువినగాను
తనమంత్రులజూచ పస్పుడు బల్కెను దనరచోద్యముగను
వినరయ్యావోమంత్రులారయీ వివరముజెప్పెదను
ఘనుడగు పాచ్ఛావునుజూడగను గడుప్రీతినినేను
మనమలరగయాఢిల్లికిపోయి మరలిటువచ్చెదను
వచ్చుదాకయీరాజ్యముమీరే వదలకచూచుకొని
మెచ్చగనిచ్చటికార్యములెల్లను యింపుగానుపూని
చేయుచునిచ్చటిసమాచారములు శీఘ్రంబుననాకు
వ్రాయకప్పటప్పటికి తెల్పుడు పరగనేనుమీకు
చెలువుతోడనాసంగతులెల్లను తెలియగజేసెదను
యెలమితోడనేపోయివచ్చెదను యింకవేడ్కగాను.

(శూరసింగు తనభార్యవద్దికిబోవుట.)

అనితనమంత్రులసమ్మతిపరచి యంత తానులేచి
మనమలరగయానగరుకునేగి తనసతినటుగాంచి
సతివినుమొక్కటినేనుచెప్పెదను చయ్యనరాంబాయి
హితమతితోడనునీకు చెప్పెదను యిప్పుడు రాంబాయి
రయమునఢిల్లీ పాచ్ఛానన్ను రమ్మనెజల్దిగను
నయముతోడనేబోవలెనిప్పుడు నచ్చటికినియికను
ఇచటభద్రముగనుండుమునీవు యిప్పుడు రాంబాయి
అచటికిబోయిజాబువ్రాసెదను యిచటికి రాంబాయి
పరగబోయివచ్చెదనని చెప్పిన ప్రాణనాథుతోను
సరగునరాంబాయిచింతనొందుచును చయ్యనసిట్లనెను
దేవరవారికినేను యిప్పుడు తెలియజెప్పగలన
సావకాశములేదికప్రసవసమయంబిదియనిన

కరుణతోడ రాంబాయినిజూచి కలకలనవ్వుచును
మరినీకేమిటతక్కువయున్నది మగువరో యిచ్చటను
పాయక దాదులతోడనుండుము భద్రంబనిలేచి
పోయివచ్చెదనితమ్మునికంతట పొందుగానుజూచి
వేయుగుఱ్ఱములత పాలుంచుము వేగధరణిసింగు
చేయవలసినజాగ్రతలెల్లను జేయుధరణిసింగు
అనినతమ్ముడునుశూరసింగుడు నంతజల్దిగాను
ఘనసత్వములౌ హయములనెక్కి కదలిరంతలోను
త్వరలోఢిల్లికివచ్చిచేరిరి తపాలమార్గముగా
ధరలోగల్గినరాజులెల్లను తప్పకవచ్చిరిగా
పాచ్ఛాకొలువులో శూరసింగుడును బహుధైర్యముతోను
అచ్చాయనుచును పాచ్ఛావుకుతా నప్పుడుసలామనెను
బదులుసలామునుచేసిచూచెను పాచ్ఛావప్పుడును
మదిసంతసమునశూరసింగునకు మర్యాదలతోను
వచ్చినరాజులెల్లకొలువులో వరుసనుండగాను
అచ్చటగూర్చుండగనియమించె నయంబుగనిద్దరను.

{ ఢిల్లీపాచ్ఛా శూరసింగునకు మర్యాదలుచేసి
పిలిపించిన కార్యమును దెలుపుట. }

శూరసింగునిపాచ్ఛావంతట చూచిపల్కెనపుడు
వారకనందరురాజులువినవొక పలుకుబల్కెనాడు
వినుడో దేశాధీశులార యొక వివరమునిప్పుడును
పనిపడిమిమ్ముబిలిపించిన కార్యము బాగుగదెల్పెదను
దేవలోకగుఱ్ఱంబొకటిక్కడ తేజరిల్లుచును
యీవసుధనుగలగుఱ్ఱంబులలో నిదియెక్కువగాను
ఉన్నది దానినెక్కినవారికి నుచితంబుగనిపుడు
మన్ననచేసివారిపాళెమును మరియిచ్చెదనేడు

కొన్నియినాములతోడను వారికి గుఱ్ఱమునిచ్చెదను
యిన్నికార్యములుగలపిక్కడమీ యిష్టంబేమనెను
ఆమాటలువిని రాజులందరును అతిమోదంబునను
ప్రేమతో గుఱ్ఱమునెక్కెడికొరకై తాములేవగాను
ఘనశౌర్యులనగు నా రాజులగని కలకలనవ్వుచును
కనుగొనివారలపాచ్ఛా వప్పుడు గర్కునిట్లనెను.

(ఢిల్లి పాచ్ఛా రాజులతో ప్రతిజ్ఞ సేయుట.)

ఏనొకమాట చెప్పెదవినుడీ యిపుడు రాజులార
పూనిగుఱ్ఱమును యెక్కినవారికి పొసగ రాజులార
ఘనమగుబహుబహుమతులనునిత్తును మనమలరగ నేను
ఘనులనివారిని మెచ్చి ప్రియంబున కౌగిట జేర్చుదును
ఆగుఱ్ఱముపై నెక్కనివారని అతికోపముతోను
వేగముగానై జేండ్లబాకను వేతఖైదులోను
అనగా వినియా రాజులందరు నప్పుడు సమ్మతించి
మనములసందేహించుచునుండగ మరి పాచ్ఛా లేచి
వచ్చెను రాజులతో గూడుకొని చెచ్చెరనంతటను
అచ్చటబారాహజారిగనుగొన నతిభీకరముగను
అంతటబారాహజారిగజ్జీల నట్టెదిగులు జెంది
గంతులువేసినమాత్రములోన కడుభీతియునొంది
మిన్నువిరిగిపైబడినటు రాజులు మేదినిపైబడిరి
కన్నులుచెదరగతలలువంచుకొని కడువడిచింతిలిరి
గడగడవణకుచు మూర్ఛలదేలుచు కాళ్లనుకడువడిగా
తడబడనందరు యేమియుదెలియక తారుమారుగాగా
అప్పుడుపాచ్ఛావునుగనుగొనివా రందరిట్లనిరి
చెప్పలేము యీగుఱ్ఱముమహిమను అప్పయే మొగానికె
ఇప్పుడుమహారాజీగుఱ్ఱము మే మెక్కలేము యికను

తప్పక మెక్కిన ప్రాణమునిలువదు తడయక మాకికను
దేవలోక గుఱ్ఱముపై నెక్కను దేవతలే గాని
యీవసుధలో గలవారికిదగునా యీగుఱ్ఱముపూని
ఎక్క లేముయీగుఱ్ఱముపైని నిక్కముగా మేము
గ్రక్కున ప్రాణంబులతోనైనా ఖైదుననుండెదము
అనుచా మాటలు తావిని పాచ్ఛా వంతటనవ్వుచును
ఘనముగ భూమీశులతో పల్కెను వినుడనుచును తాను
ఎంతో శూరులరనుచుమిమ్ము నే నిచటికి రప్పిస్తి
యింతటిధీరులరగుట వహ్వామీ చెంత నే సరిచూస్తి
నక్కకైన నీయంతటి శౌర్యము లెక్కింపగరాదు
దిక్కులేని పాడూరికి నెన్నగ నక్కపోతురాజు
మేకపోతు గాంభీర్యంబని నే మేదిని వినియుంటి
దాకలాయనా మాటయిపుడు మీ దాపుగ నేగంటి
పురుషచిహ్నములు దాల్చి షండుడుపోలతుల నేలుటయుక్
అరయనటులనగు మీరీ బారా హజారి నేలుటయుక్
బిడ్డయునైననుజూచి మీయటులు భీతియు జెందదుగా
తెడ్డయినను యీ తేజిగజనకు దిగులిటునొందదుగా
అనియిటులోకులు పల్కెడు వాక్యము లవివృధ గావయ్యెక్
చెవకిచూడగా నిది తెరగని మా చిత్తముగననయ్యెక్
బలేబలే వస్తాదులు మీరే వహ్వారేయనుచు
చలోచలో తుంఖైదుకునిపుడే శీఘ్రముబొమ్మనుచు
వరుసగ రాజులరెల్లరునైదు వత్సరంబులిటను
సరవితో ఖైదులోనుండి వెనకనిరు సంవత్సరములును
ఊరకనిచ్చటనుండియు నావల వూరికిపోవలెను
సారెకు పాచ్ఛాయిట్లని పల్కిన సమ్మతినందరును
సింధుఖైదులో నుండి వారల నెలవుకు జాబులును

ఖండితంబుగా సంగతులెల్లను కనుపడ్రవాయుగను
వెతలబొందుచును వేవిధంబులను విధిగడుదూరుచును
అతివ్యసనంబునగుందుచునుండిరి అప్పుడునందరున
అటులనారదుడు దెల్పగనింద్రుం డత్యద్భుతముగను
పటుతరముగ మునినాథ దెల్పితివి పరమమోదంబునను
అవతలివృత్తాంతంబేమాయెను నారదనాకిటను
ప్రవిమలముగనది దెల్పుమన్నను పరమమోదమునను

{ ఇంద్రునకు నారదుడు
చెంజిపట్టణవృత్తాంతము దెల్పుట. }

వినుసురనాయక చెంజిపట్టణపు వృత్తాంతంబికను
ఘనముగనీకే దెల్పెదనిపుడు కలవృత్తాంతమును
చెంజివిడిచియాశూరసింగడు చేరగఢిల్లికిని
రంజితముగనటమేడునాళ్లకు రాముబాయికిని
పుత్రోత్పత్తియుగలిగినసందరు భూరిసంతసమున
నేత్రోత్సవముగ పట్టణమెల్లను నెరిశృంగారమున
భేరిభాంకారాదివాద్యములు భోరుకొల్పగాను
వారటుచక్కెర పంచిరప్పుడు వరుసతో వీధులను
పరముదంబునవచ్చినవారికి బహుమతులనుయిచ్చి
యరయగకొలువుననున్నజనులకు నటయినాములిచ్చి
పుత్రునిజూచిసంతోషంబున పొంగెను రాంబాయి
గోత్రరక్షకుండితడని తాను కోరెను రాంబాయి
బాలుడుపుట్టినయిరువదిదినమున పరగఢిల్లినుంచి
చాలతపాలలోవచ్చినజాబును చయ్యననటు గం
శూరసింగడు ఖైదులోపడ్డ సొబగులు తలపోసి
సారెకువగచుచు విధినిదిట్టుచును సతిపతిదలచుచున
కూరిమిపుత్రుడు కలిగినప్పుడు మీరులేకటను

తారుమారుగానున్నది గాదా తగుపనిజరుగకను
పురుషుఁడు లేనియిల్లేటికి కాఁపురమిక నేమిటికి
పురుషుఁడు లేనిసొబగేమిటికి మోదంబేమిటికి
పురుషుఁడు లేనివిభవంబేటికి భోగంబేమిటికి
పురుషుఁడు లేనిపురమేమిటికి పుత్రుండేమిటికి
పురుషుఁడు లేనిజీవనమేటికి భువిబ్రతుకేమిటికి
పురుషునిబాసినజన్మమేటికి సిరులుండేమిటికి
బాలునిముద్దులపలుకులువినగను పరగప్రాప్తి లేక
బాలగచిన్నికుమారునినెత్తుక సరగగాంచలేక
ఈతనయునిదాకండ్లజూచునో యెటులున్నదో కాని
ధాతవ్రాలుయీతీరుననుండిన తప్పునెయేరికిని
మంచిదికానీయెట్టులనైనా పతియువచ్చుదాక
మించినవేడుకనీకుఱ్ఱనినే బెంచుచుందుగాక
అనుచును రాంబాయివ్యసనమువదలి తనయునిజూచుచును
ఘనమగుసంతోషముతో బెంచుచు కడుప్రీతిగదాను
జాబువ్రాసెనువిభునకునప్పుడు చయ్యనఢిల్లికిని
జాబుచూచుకొని శూరసింగుడు సరగవ్యసనమూని
ఉండగ చెంజీలో దేసింగుబాలుం డొప్పగవేడుకను
రెండుమూడునాలైదునెలలునటు నిండినయంతటను
బోర్లబడుచును జరుగుచునంతలో పొల్లుతప్పడిలుచు
మెల్లనెనడుచుచుదుముకుచువ్రాలుచు మేలుగపరుగిడుచు
కుప్పిగంతులనువేయుచు సఖులతో కూడిచదువుకొనుచు
అప్పుడుతల్లిదగ్గరకొచ్చి యాకలాకలనుచు
పాలుచక్కెరతెమ్మనితల్లిని పలుమారడుగుచును
పాలుపాలనితల్లినిజేరి పయ్యెదపాకుచును

చన్నాసంగుమాయమ్మాయనిబల్ సద్దులొనర్చుచును
క్రన్ననరంతులుచేసిముదంబున చన్నులుద్రాగుచును
మేలుగతనసమసఖులతోడను మెలగుచుతిరుగుచును
వాలాయంబుగమహామత్ ఖానుని వదలకగూడుచును
తల్లిదగ్గరకు జేరియమ్మమాతండ్రేడీయనుచు
మెల్లనలేచి వెలపటికొచ్చి మేటపనులుగనుచు
అల్లకల్లోలముజేయుచునూరిలో నెల్లవారికలచు
సల్లలితంబుగనీతివిద్యలు చయ్యనచదువుచును
సహజముమహామత్ ఖానతో గుఱ్ఱపు సవారిచేయుచును
కహాకహానవ్వుచుకన్నతల్లినటు కన్నులజూచుచును
అంతటమహామత్ ఖానునిగూడి యటపయిగెత్తుచును
చెంతనున్నకొండలపైనెక్కియు చయ్యనదుముకుచును
పంతములాడుచుగుండులనెత్తి పరగరువ్వుచును
గంతువేసిసింగేటిలొనావలి గట్టుకుదాటుచును
పందెముచేనొకగుక్కకుమూడు పరువులుచారుచును
సందేహించకపెద్దమ్రాకులను సరగునపెరుకుచును
పులులసింహములనెదిరించుకొని పొడిచియుచంపుచును
తలచకనొకదినమందునతండ్రిని తల్లినివడుగుచును
ఇటువలెనైదేండ్లాడుచునొకనాడింపుగతల్లితోను
పటుతరముగమాతండ్రియేడీయని పలుమారడుగగను.
(దేసింగుతల్లియతనితోశూరసింగువృత్తాంతముదెల్పుట.)
తనయునెత్తుకొనిముద్దుబెట్టుకొని తానిట్టులననియెఱ
ిసుకుమారమీతండ్రిశూరసింగని తెల్పగదొణగెఱ
పనిబూనియుమీతండ్రినిఢిల్లీ పాచ్ఛావచ్చుటను
వినుమీదేండ్లటుఖైదులోబెట్టిన విధమునుదెల్పెదను
దేవలోకమందుండియచటికొక తేజిరాగనాడు

యీపట్నమునగల రాజుల నెల్లను యెలమిబిలిచినాడు
ఈగుఱ్ఱంబును యెక్కినవారికి యినాములిచ్చెదను
బాగుగ నెక్కనివారిని ఖైదులో పరువడినుంచెదను
అని చెప్పినయా రాజులు చారా హజారినటుజూచి
ఘనమగు భయమును జెందుచు మనముల గడుచింతిలిచూచి
సలామయ్యా బహుసలాము పాచ్ఛా సలామయ్యా మీకు
బలే గుఱ్ఱమిది యెక్క గూడదు భయముకలిగె మాకు
అనగా పాచ్ఛా రాజులనందర నట ఖైదులోనుంచె
మనమున బొక్కుచు తనయునిగని యొక మాటమందలించె
విన తండ్రియు మీతండ్రియు నిద్దరు వినుము నాటనుండి
తనయా ఖైదులోనున్నారనగా తానటుకోపించి
పండ్లు పెటపెటనికొరికెనప్పుడు బాలుడు దేసింగు
కండ్లు వురుముచును కోపము చేసెను ఘనుడగు దేసింగు
రెండుగడియలకు లోపల ఢిల్లిని పిండిగ జేసెదను
దండియైనయా గుఱ్ఱము నెక్కి దవుడాయించెదను
అనుచు తల్లికి కనిదండము బెట్టి యమ్మా యిప్పుడును
ఘనముగ నాకును మంచివుత్తరము గ్రక్కున నీవలెను
ఇప్పుడు ఢిల్లికి వడి నేగయు నే నెక్కియు గుఱ్ఱమును
తప్పక తండ్రులనిద్దర దెచ్చెద తల్లీ వినుము నేను
జల్దీజల్దీ వుత్తరమిమ్మా జల్దిగా నుతల్లి
జల్దిగా నునే బోయివచ్చెదను సెలవొసగుము తల్లి
అని చెప్పినయా తనయుని జూచి యంత వ్యసనమునను
వినరా ముద్దుల తనయా తనయా మరినీ విటుల బల్కితేను
కని పెంచిన నా గర్భము చల్లన గాంచు టెట్టులికను
నినువిడిచియు నొకగడియైన నే నెటులనుండగలను
అనుచు చేతులు పిసుకుకొనుచుతా నంతమూర్ఛజెంది

ఘనశోకంబున నేలబొర్లుచును కడువ్యసనమునొంది
ఉన్నతల్లిని దేసింగుడు తా నొప్పగా నుజూచి
కన్నమూసె నాకిది సమయంబని గ్రక్కున తా లేచి
సరగ శంకరాభరణమేటిలో స్నానంబును జేసి
పసుపడి రంగేశుని సన్నిధికి భక్తితోడ వచ్చి.

(దేసింగు శ్రీరంగనాథుని స్తుతించుట.)

పన్నగశయనా పంకజలోచన పద్మనాభ రారా
చెన్నగ నిను నేనమ్మితి నిప్పుడు శ్రీరంగా రారా
కరుణాకర శ్రీనరహరి రంగా కామితఫలవరదా
కరిహా హరియని మొరలిడ విని చని కరుణింపగ లేదా
మును ప్రహ్లాదుని నేలినకరణిని బ్రోవగ దయరాదా
ఘనముగ నలనాడా ధ్రువు గాచిన గతి నేలగ రాదా
అనాథరక్షకా దీనజనావన సనాతనా నిన్ను
వినాగ వేరేదిక్కు లేదు నా మనవిని వినినన్ను
ఘనంబుగను నాయండ నుండుమని గ్రక్కున వేడితిని
మనంబునను నిను ముదంబునను నే మరిమరి మ్రొక్కితిని
రంగనాయకా నే నుఢిల్లికి రయమున పోవలెను
సంగతిమీరగ ఢిల్లిలో గుఱ్ఱపు స్వారి చేయవలెను
తండ్రుల ఖైదులో నున్నవారిని తడయక తేవలెను
తండ్రి నీవని నమ్మితి నాపై దయ యుంచగవలెను
సమ్మతిమీరగ నాకు సహాయము సరగున రావలెను
నమ్మినిమ్ము నే ఢిల్లికి పోయెద ననుచు వేడగాను
చయ్యన దేసింగునితో రంగస్వామి యిటులనెను
అయ్యా వినరా దేసింగానీ కతిసహాయముగను
వచ్చెద పోయిరమ్మని చెప్పిన ముచ్చటతోడుతను
హెచ్చుగ మహమత్ ఖానునిజూచి యచ్చటివిధములను.

(దేసింగురాజుమహామత్ఖానునితో గూడి ఢిల్లికిపోవుట.)
తప్పకచెప్పియువనమిద్దరము తగఢిల్లికి నేడు
తెప్పునబోవలెనన గామంచిది దేవరయన్నాడు
మనకు రెండుగుఱ్ఱంబులదెమ్ము మహామత్ ఖానుడ నేడు
మన ఖర్చులకును రొక్కము తెత్తుకొ మహామత్ ఖానుడ నేడు
అనుచును దేసింగుడు బల్కగనా మహామత్ ఖానుడును
వినయంబున వా కార్యములన్నియు విశదరీతిగాను
తడయకనప్పుడు తనమదిబొంగుచు తయారుచేయగను
వడిగలగుఱ్ఱములెక్కియిద్దరును వడిగాపోవగను
పదిదినంబులకు జేరిఢిల్లీ పట్టణమప్పుడును
పదిలముగానా పాచ్ఛాకొలువులో వచ్చినిలిచి యాటను
మండివేసుకొనిసలాంచేసెను మరిపాచ్ఛాకును
పండితుడగుబాలునికిని పాచ్ఛా బదులుసలాముసెను
రాజాధిరాజులందరు రయమునజూడగను
తేజంబునుగలరాజసింహుని ధీరునిబాలకుని
(పాచ్ఛాదేసింగురాజువృత్తాంతమును విచారించుట.)
పాచ్ఛావప్పుడుచూచిబాలుని పరమాశ్చర్యముతోను
అచ్ఛాబహాదర్ తుంకోనన గా నట దేసింగుడును
సాహెబుపల్కెను పాచ్ఛాతోను సరగ చెంజివేలు
శూరసింగునితనయుడ నేను సొంపుగ నా మేలు
తప్పకవినునే దేసింగుడమా తండ్రులునిద్దరును
యిప్పుడునీ ఖైదులోనున్నారని చెప్పగనిట నేను
వచ్చితిబారాహజారినెక్కగ వచ్చితినిట నేడు
చెచ్చెరగనునాప్రతాపమిప్పుడు చేజేత నేచూడు
చెప్ప నేలయాబారహజారిని శీఘ్రమె తెచ్చినను
తప్పకస్వారీచేసియునీమది మెప్పుజెతున నేను

అవనామాటలువినియాపాచ్ఛా యాశ్చర్యముజెంది
కనసామాన్యపుగట్టుముకాదది కటకటయానిగుంది
లేచివచ్చియాబాలునిప్రియమున జూచిముద్దుబెట్టి
యీచిత్రముదానేమనిచెప్పుదు నెంచుగానవిట్టి
ఐనయేండ్లయీబాలుండెంత యారాహాయమెంత
కాదువీనిచేనెక్కటకరిమశ కాంతరమిదివింత
పిల్లమాటగాదోచలేదుమరి పెద్దమాటగాదు
కల్లమాటగాదోచలేదుని క్కమ్ముదోచలేను
ఈబాలకునివాక్యంబిప్పుడు యిదినిజమనియెంచి
ఆబారాహజారినిచ్చట నారయరప్పించి
చూచినంతయీకట్టుదాని చూచియునేమన్నా
బాపురెచూపకనన్ననప్పడీబాలుండేమనునా
మించినచింతతోపాచ్ఛాయిట్టుల నెంచెనుతనలోన
మంజెయికంకణమరయుటకున్నిట ముకురముకావలెన
చల్లకొనంగనువచ్చిముంతదా చంగనేలమనకు
కల్లనిజంబులురెండునిప్పుడే గనెదక్షణంబునకు
అనియిటులనియాపాచ్ఛావప్పుడు నాదేసింగునకు
ఘనగట్టుముచూపించునంతలో తనతనయునిపలుకు
అన్నియానవాలన్నిసంగతు లన్నితానుదెలిసి
చెన్నుమీరయాశూరసింగు దేసింగునినటుగదసి
ఏరాచిన్నికుమారానీవిట కేలవచ్చితౌరా
ఘోరకైనినిమీతల్లిటువిడిచి యోర్చియున్నదటరా
నాకులదీపమనాసుకుమారా నాదుతండ్రిరారా
నీకై దేండ్లకుయిచటికిరాగా నేకతముండెనురా
అనినతండ్రితో దేసింగుడుతా నప్పుడిట్టులనెను
ఘనముగబారాహజారినెక్కియు గ్రక్కునమిమునేను

చెరవిడిపించి పిలుచుకపోవను మరివచ్చితిననియు
సరసంబుగ నిటు పల్కె తండ్రితో జనపతి గనుగొనియు
ఏలయ పాచ్ఛా మంచితిరేమో యింతలో మీమాట
కాలయాపనము చేసుట మేలా కనుమిక నామాట
నాపరువునుః యీబారహజారి పరువు నెరుగలేక
యీపట్లను మీకింత యోచన యెందుక యిందాక
ఆరయ శునకములెన్నియును హరికిని సమమవునా
బారహజారులెన్నియునా బాలా సమమవునా
బక్క గుఱ్ఱమును పెట్టుకనేమో నిక్కెదేః బహుశా
చక్కని ఘోడా యైతే చూపుము యెక్కెద భూమీశా
అందర మోసంబొందించినయీ చందంబిది గాదు
ముందుగ గుఱ్ఱము దెప్పించుమునా ముందర నిక మీదు
తెప్పించక నుండితి రేనికని దేశాధీశులకుః
అప్పణ యిచ్చినయాజ్ఞ యెవరిదో యారయ దేవరకుః
పరిపరివిధముల బాలుడు పలికిన పాచ్ఛా నవ్వుచును
సరగున నెల్లర గూడక నాహాయ శాలకరుగగాను
చూడగ గుఱ్ఱము గజ్జన చేసిన సొంపుశబ్దమునను
తోడనె రాజుల గుండెలు పగిలెను పోడిమి చెడియటను
కోటయుడిసి పడినట్టులుండెను వీటివారి కపుడు
సాటిగ మేఘంబుల గజ్జనవలె సరగ దోచెనపుడు
చెవులు ఘుమ్ము ఘుమ్మనగా రాజులు చయ్యన మూర్ఛిలిరి
చివులు జెదివారందఱు పుడమిని తెకవ చెడపడిరి
శూరసింగుడనతని తమ్ముడును సొలసి తలవంచి
బీరము చెడిబల్ బెడగునన ప్పుడు బెదరియుండ జూచి
తెంపున మహమత్ ఖానుని జూచి దేసింగుండనెను
తెంపుమ గాడిపి చాడిగుఱ్ఱమును తెమ్ము వేగమునను

తెప్పునగుఱ్ఱంబునకుబంగరు జీనివేసితెమ్ము
తప్పకవజ్రాల్ చెక్కినకళ్లెము త్వరగవేసితెమ్ము
అనిచెప్పినయామహమత్ ఖానుం డట్టులచేసి తేగాను
తనమదిబొంగుచు దేసింగుడు తేజిని తట్టిపట్టివేగా.

(దేసింగురాజు బారాహజారి నెక్కుట.)

కనకనమనుచును గర్జనచేయగ కదసికళ్లెమును
ఘనశౌర్యంబునబట్టిగుఱ్ఱమును కడువడినెక్కగను
సింగమువలెతా నెగసెనంత దేసింగుండంతటను
భంగముప్రాణులనొందించెడిపులి భంగనెక్కినటను
బాలుడైన దేసింగుడుహయమును వడిగనెక్కజూచి
జాలిజెందుచునుతహతహపడుచును చాలచింతవగచి
శూరసింగుడుతమ్మునితోడను సుతునొద్దకువచ్చి
బారహజారి నెక్కుటజూచి పనువడినెద మెచ్చి
మన్ననతోడకుమారునిగనుగొని మనమునగుత్సించి
కన్నులనీరునునించుచునప్పుడు కటకటపడిజూచి.

{ దేసింగుబారాహజారియెక్కగా నతనితండ్రియు
పినతండ్రియు దుఃఖించుట. }

తనయానీవీగుఱ్ఱమునెక్కగ తగదికనిట రారా
చనువుతో పాచ్ఛా చేసెలవునుగొని చనుదమిప్పుడు రారా
అనినతండ్రితో దేసింగుడు తా నప్పుడిట్లులనియె
ఘనమగుగుఱ్ఱము నెక్కగభయపడనైదులామిమ్మిపుడు
పెట్టియుండనే నెక్కియుగుఱ్ఱము ప్రీతితోడమిమ్ము
దిట్టముగా విడిపింపగవచ్చితి తిపిరి నేడు నమ్ము
ఊరకెపోయినన వ్వరెశూరులు పొసగతండ్రులారా
నేరకగుఱ్ఱము నెక్కకవదలను నిజముతండ్రులారా
సావీ చేసివచ్చిననన్ను చక్కజూడరయ్యా

హారించకుడీగుఱ్ఱముచేబడ వగవ నేలనయ్యా
మించిమనంబునచింతిలవలవదు మీరుతండ్రులారా
మించినవారీచేయగవలెనే నెంచతండ్రులారా
పుట్టినప్పుడేచావునిజంబని పొసగతండ్రులారా
దిట్టముగామీమనములనమ్ముడు తెలిసితండ్రులారా
అనియిటుపల్కిసలాముచేసి యపుడునిలిచినాడు
పనిబూనియుగోవిందాయనుచును పరగజూచినాడు
అంతలోననాశూరసింగుడు నటుతనయునిజూచి
యింతచేసుటకు నేలపుట్టితివి యిపుడనిమదివగచి
తొలుతనుబుట్టినయప్పుడెచచ్చిన దుఃఖములేదయ్యా
యెలమితోడమీతల్లియిపుడుని న్నెట్లువదలెనయ్యా.

(దేసింగుడు గుఱ్ఱము నెక్కి దవుడాయించుట.)

కలతజెందియేమయ్యెనోయనగా కదలిచెతేజీనివేగా
జలిదియనుచుదవుడాయించెను చయ్యననటుబాగా
పటపటపటపటపటపటయనుచును పరువులెత్తెనపుడు
చిటచిటచిటయనియెడమకాలికి చిమటయిచ్చినాడు
షోమెషోమెనని రాజులందరును పొక్కుచుజూడగను
వోయయ్యానీవెందుబోయెదని యొప్పుగబిలువగను
వాయుమార్గమున నెగయగనప్పుడు వదలకగుఱ్ఱమును
పాయకమేఘమండలమందు పారెడుగుఱ్ఱమును
నారాయణగోవిందాయనుచును కోరిపట్టెనపుడు
వారిజాక్షహరివరదాయనుచును వడిగవిడిచెనపుడు
గరుడునివలెనాగుఱ్ఱముపొడవుగ కడువేగమెనడిచెన్
వురువడికలిగినవాయువువలెనే వొప్పుగానుపరచెన్
కొండలనెల్లను మెండుగదాటుచు గొనకొనియెగయుచును
చెండువిసరుముగంతులువేయుచు చెలగముడుంగుచును

అడవులదిరుగుచుమ్రాకులద్రోయుచు కడువడిదాటుచును
తడవుగదిరుగుచుతలక్రిందుగబల్ ఘాటిగబరచుచున
గాడుపడియుటసింహములెల్లను గదలకదిగబడివెన్
గూడులనుండకపక్షులెల్లను గోబగోబయనిపరవన్
మృగలెల్లనుదేసింగుపరాక్రమ మొప్పుగగాంచుచును
సరగునబారాహజారిపరచెడి చతురతమెచ్చుచును
అంతటగుఱ్ఱమునాలుగుదిక్కుల వింతగానుతిరిగి
పంతంబుననాదేనూరామడ పరగదిరిగితిరిగ
ఇటువలెగుఱ్ఱంబైదుదినంబులు మెచ్చుగానుచెలగి
తటుకునబాలుపరాక్రమంబును తనమదిలోనెరిగి
ఈబాలునిచేబలహీనమునాకిపుడుగలుగుననుచు
స్వాభావికమునువిడిచిమాయలో సంచరింతుననుచు
మేరుపర్వతముచెంతనువీనిని మెలగత్రోతుననుచు
సారెకుతెలచియువెతలబెట్టగా చయ్యనతాగనుచు
శివిరినిద్రయాహారములేకను దినంబులైదవ్యెన్
దివమునురాత్రియునొక్కటదిరుగుట తేజహీనుడవ్యెన్
కన్నులుగిరగిరదిరిగిశోషచే కడుభీతినిదూలెన్
పన్నగశయనునిరంగనాథుని పరువడిదలచెనుజాలిన్.

### { దేసింగుబారాహజారిని వంచుకోజాలకడస్సి రంగనాథస్వామిని ధ్యానించుట. }

కళ్లెముగట్టిగబిగబట్టుకొని గడుసుతేజిపైని
మెల్లనమెడతనచేతులజుట్టియు వెదలకపండుకొని
రక్షింపుమురంగేశాననుసంరక్షింపుములోకేశా
పక్షివాహనాపరమపవిత్రా పన్నగశయనసురేశా
వారిజనాభజనార్దనాచ్యుతా వాసుదేవశౌరీ
సారెకుభయమునుజెందినిన్నునే సన్నుతింతుకోరీ

భజియించెద రక్షింపుము నన్ను పరమమౌనివినుతా
గజవరదా నను బ్రోవవె స్వామీ కారుణ్యముచేతా
జయజయ భక్తజనావన బ్రోవుము జయజయ శ్రీరంగా
జయవిజయాభవదిగ్విజయాభజ జయ జయగరుడతురంగ
సుజనగణావన దుర్జనమర్దన సుందరతరవదనా
విజయహృదయకమలాంతరవాసా వేదవేద్యసదనా
దశరథనందన దశముఖభంజన తాటకసంహరణా
పశుపతివందన పన్నగశయనా పంకజమృదుచరణా
శరణుజొచ్చినను యరమరజేతుర సరగుననిటురారా
శరణు శరణయా కరుణాసాగర కరుణింపగరారా
బిరాన రారా వరాలొసగ శ్రీకరాయిటులరారా
పరాకేల రాపరాపరా శ్రీధరాయిటులరారా
సకలచరాచరసముదయములకును సముదనగనుబరగి
సకలేశుడవై సర్వాత్ముడవై యకలంకుడవై చెలగి
లేదాదయయికరాదా శ్రీదామోదరయిటురారా
నాదా బ్రోవగరాదా నీచేగాదా రఘువీరా
ఏదయనీదయ మేదయరాదయ సాదరముగరారా
వో దాశరథే యోదయానిధే యోకృపానిధేరారా
మోసబుచ్చియీహయమెచ్చుటకో తీసుకపోదలచి
వాసిగనున్నది యిదుగోనిను సేవరుసగ మదిదలచి.

(రంగనాథస్వామి దేసింగునికి ప్రత్యక్షంబై రక్షించుట.)

భజనసేయుచున్నానని వేడగ భక్తపరాధీనుండు
విజయముచేసి దేసింగునితో వెరవకుమనియపుడు
గజిబిజిబారెడిగడుసుహయంబును కడువడిబోనీక
హాజరకత్వారుపమిక జెల్లదునీ యహమదంతుగాక
చిన్నబాలునిచిక్కులబెట్టెడి చెడుగుతురంగమయిపుడు

మన్నించి మునీయున్నతినణచి తిన్నగనడుమిపుడు
పన్నగశయనుండనిన నెన్నెరుగుము పలువయనుచునపుడు
సన్నుతమునివరుడగురరంగేశుడు చెన్నుమీరనపుడు
కన్నులుచెదరగ పెటుపెట్టినను ఘనముగుగుఱ్ఱంబు
మిన్నువిరిగిపైబడ్డటునిలిచెను మేటిధాటిగుఱ్ఱంబు
బాలునిబారాహజారినీపిటు భంగపెట్టదగునా
చాలుచాలునీజవముదెలిసెనిక చనగానిట్లగునా
బాలునినీవుఢిల్లికిదీసుక పరువునబొమ్మికను
బాలకుండునాభక్తునివీని భయపరుపకనికను
కొన్నిదినంబులకీబాలునిచే గోర్కెదీరనీకు
సన్నుతమౌయుద్ధంబునాదవును చయ్యాననటనీకు
మోతుమిచ్చెదనుజల్దిగపొమ్ముముదమొదవగననిన
నాక్షణంబుననుఢిల్లిసమీపం బౌమాగణముగనిన
బాలునిలేపిరంగనాయకుడు పటుదయతోడతను
మేలువరంబులొసంగియుధైర్యము మెప్పుగజెప్పగను
అప్పుడుదేశింగుడురంగేశున కతివినయంబునను
తప్పకసాగిలిమ్రొక్కిమిక్కిలి ధైర్యంబునతాను
నరహరిశ్రీహరిమురారిశౌరి నన్నిప్పుడుచేరి
పరలిచితెచ్చితిమాగణముదప్పక మధుకైటభహారీ
శరణుశరణునిన్నమ్మితినయ్యా శరణురంగనాథా
కరుణతోనీదాసునినను బ్రోవుము శరణురంగనాథా
అనినుతియించినదేశింగునితో నపుడుస్వామియనివెఱ
ఘనుడగుఢిల్లీపాచ్ఛానిప్పుడు కడువేగమెకనివెఱ.

(దేశింగురంగనాథునియానుగ్రహంబున ఢిల్లి చేరుట.)

మనమలరగబహుమతులగైకొని మరితంద్రులతోను
వనముచెంజికనిరంగస్వామి చయ్యనబోయినను

అప్పుడు బారాహజారిపాదుషా హజారమటు జేరి
తప్పకఁ జఱనసేయఁగ నందరు తడబడియటజేరి
చిన్నికఱ్ఱ నాగుఱ్ఱంబునుగని కన్నులనీరుంచి
అన్నరార నాయన్నవేగ నా కన్నరారమించి
శూరసింగుడుబిడ్డనిముద్దిడి చుంచుదువ్వగాను
హారతులెత్తిదృష్టితీయుడని యానందముతోను
ధీరుండగుబాలుని తాఁగనుఁగొని దృఢమతితో పాచ్ఛా
కోరికెలడుగుము నిన్ను మెచ్చితి కూతుఱా నీకు నేడచ్ఛా
మ్లేచ్ఛుండనినన్ మెచ్చకనుండకు మేలొనతుఱా బాలా
స్వచ్ఛంబౌనీచరితము మేలు సమకూర్చెను బాలా
నీశౌర్యంబును నీబలమును నే నిప్పుడెరింగితిని
కేశవభక్తులకెప్పుడు భీతియు లేశముగలగదని
పాచ్ఛాపలుకుచునుండగ తనమది పరమాశ్చర్యమునొంది
స్వచ్ఛంబౌ సత్కీర్తిని గాంచిన సజ్జనపెనుపొంది
ఉండుమునీవని శూరసింగుడును వొప్పుగదీవించి
దండిమీరగానందను నెత్తుక తనతోడ పైనుంచి
నేను చేసినపూజలన్నియును నేడు సఫలమయ్యెన్
కానరానియాపదలువచ్చియు కడగదొలగిపోయెన్
అనగానచ్చటి రాజులెల్లను అతిముదమును జెందన్
ఘనుడగు పాచ్ఛా వాకుమారుపై కడుసంతసమందెన్
మేలనిబాలునిసింహాసనమున మెలకువతోనుంచెన్
చాలగ నాలింగనమును జేసి చయ్యనలాలించెన్.

### ఢిల్లి పాచ్ఛా దేసింగురాజునకు బహుమతులు చేయుట.

రాజసింగబాబును నటచూచి రయమున నిట్లనెను
రాజసింహుడౌ దేసింగునకు వాజులులక్షయును—

మూషకణజములరొక్కమునిటకు ముందుగ దెప్పించు
నేడులక్షలమద మేనుంగుల నిప్పుడురప్పించు
సకలసేనలకు దాసీజనముల చయ్యాననిప్పించు
ప్రకటితముగ భూషణవస్త్రంబుల పరగనందునుంచు
అనియీతెరగున నాజ్ఞాపించగ నప్పుడు వేగముగా
చనియెను రాజలింగబాబు తా సరగున కొల్వుకు బాగా
దేసింగునికి పాచ్ఛా చెప్పిన తెరగునరొక్కమును
వాసిమీరగుఱ్ఱంబులుగజములు పరగనందునుంచు
దాసుల దాసీజనములభటులను తగురథకోటులును
వాసవలోకలోకపుగుఱ్ఱంబులుమరి వరవస్త్రంబులును
అప్పుడు తెచ్చిప్పించిన పాచ్ఛా యతనిజూచి మెచ్చి
తప్పక చెంజియినాము యేలుమని యప్పుడె సెలవిచ్చి
నవరత్నంబులకంఠహారములు నతని మెడను వైచి
ప్రవిమలరత్నకిరీటమప్పుడు బాగుగనిప్పించి
బహుమతులున్నతినటువలె జేసి పట్టుశాలువలును
సహజంబగు ప్రేమంబుననిచ్చియు చాలా మెచ్చియును
తనగుఱ్ఱంబగునీలవేణిని తటుకున దెప్పించి
ఘనుడగుమహామత్ ఖానునకప్పుడు కనవడినిప్పించి
కొన్నియినాములు మహామత్ ఖానుని కోర్కెదీరనిచ్చి
మన్ననచేసియునిద్దరజూచి మరిమదిలో మెచ్చి
చయ్యనరాజలింగబాబును నెయ్యముదవజూచెన్
వొయ్యననపుడాతనితో నాతడు వోహోవినుమనియెన్
రమ్ము వీరితోగూడిపోయిరా రాజలింగబాబు
రమ్ము చెంజికిసేనలనంపుము రాజలింగబాబు
రాజులందరును చాలాదినములు రాయిడిబడి చెడిరి
తేజినెపంబున గావునవీరిని తెప్పునవిడుజారీ

ఆనితమతము వేలేటిపరగణా లయిదువత్సరములు
యినాములిదిగా ననుభవింపుడని యిమ్మువుత్తరవులు
వెరవుమీరగానిటువలెజెప్పగ సరగునవాతఁడును
పరువడినట్లనెచేసెను పాచ్ఛావహ్వాయనగాను.

{ దేసింగురాజు తండ్రులనుబిలుచుకొని
బారాహజారితోడ చెంజికివచ్చుట. }

మరిదేసింగుడు తండ్రులతోను మహమత్ ఖానునితో
త్వరలోదమతమగుఱ్ఱములెక్కియు తరలిరి సేనలతో
పదిదినములలో చెంజికి జేరిరి బహువేడుకగాను
మదిసంతసముఃనూరివారలు మరియుఃపొగడగాను
వచ్చినబాలునిజూచుచునుండిరి వరుసగనందరును
ముచ్చటతో దేసింగునితల్లి ముదముమీరగనెను
ఎత్తిప్రీతో ముద్దులాడుచును యేమిర నాతనయా
చిత్తమెప్పుడునుసైపనుండెను చిన్నినాదుతనయా
ఇన్నిదినంబులు నెచ్చటనుంటివి వేమిరసుకుమారా
చన్నులపాలు చేకెనిప్పుడు చయ్యనసుకుమారా
అనుచుసుతునకుహారతులెత్తెను అప్పుడు రాంబాయి
చనువునదృష్టిదీసెనప్పుడు సరగునరాంబాయి
ఆదేసింగుడునందరగూడుక యంతఃపురమునమిన్న
ఆదరమొప్పగతల్లిచెంతను మోదముతోనున్న
యువరాజుగనా దేసింగునివా గొప్పగరావించి
ప్రవిమలకీర్తియొసంగవెలయుమని పట్టముగట్టించి
ఏకొదవలులేకనువారుండగ నేడోవర్షమున
ఆకునూరునితల్లిగతించిన నంతటదుఃఖమున
పొగలుచుపరలోకక్రియలెల్లను బుధులుమెచ్చగాను
తగనొనరించెను దేసింగుండును ధర్మనీతిగాను

బాలునికష్టమవత్సరంబున పరమపదంబునకు
కాలవశంబునశూరసింగుడు కడగిపోవనటకు
చుట్టములెల్లనువచ్చివగవగా శూరసింగునకును
అట్టియొనర్చెనుపరిలోకక్రియ లందరుమెచ్చగను.

(దేసింగురాజు రాజై రాజ్యపరిపాలనంబు జేయుట.)

సరగున దేసింగునకప్పుడు పుర జనులును మెచ్చగను
ధరణిసింగుడుపట్టముగట్టెను తద్దయుప్రియమునను
చనువునజనములపరిపాలించెను చణ్యావనాతడును
ఘనమతిదేసింగునిభూషింపగ గడగిరివెల్లరును
ఇటులకొన్నిసంవత్సరంబులును యేగగనంతటను
తటుకునధరణీసింగుడు మంత్రుల తాబిలుపించియును
ప్రఘనా దేసింగునకును పెండ్లి పరగ జేయవలెను
సభగలవారలునందరుగూడి చణ్యనిప్పుడును.

{ దేసింగురాజునకు ధరణిసింగు
వివాహంబుచేయించుట. }

ఆలోచనలును సేయగవలయు న్నతిగూఢంబుగను
బాలుండయ్యెను బుద్ధిమంతుడు పరగజూడగాను
మన దేసింగుకు పెండ్లి చేయవలె మంత్రులారమీరు
మనపట్టణమును శృంగారింపుడు మంత్రులారమీరు
ఇప్పుడటంచును ధరణిసింగుడు హితవుమీరగాను
తప్పకపల్కగనట్లొనర్చిరి యొప్పుమీరగాను
సరగనప్పుడేచారులవలనను ధరణిసింగురాజు
అరయగనా దేసింగునిమామను ధరణిసింగురాజు
విహితముగారప్పించియునప్పుడు వేడ్కమీరగాను
మహినొప్పగమన దేసింగునకు మదిమోదమొదవగను
పెండ్లిసేయగావలెనని మేము పెద్దలగూడుకొని

పెండ్లికూతురుయెవరనిమనముల పెరతలపులుమాని
మీపుత్రికను తెచ్చివివాహము యేపుమీరజేయఁగా
యీపట్లనునిశ్చయముచేసితిమి యికనాలోచనసేయఁగా
మీరుచెప్పినమేరకుజేయఁగ మేముసిద్ధముగను
చేరియున్నారముయిప్పుడుమీ కోరికేమియనను
వినియమునాతఁడునందునకొడబడి వేడ్కతోడనపుడు
తనపురంబునకునరిగియువృత్తాంతంబులెల్లనపుడు
ఎల్లవారికిని తెలియఁగజెప్పి యుల్లమలరగాను
సల్లలితంబుగపుత్రినవోఢ్యాని చెంజిచేరగాను
అకలంకంబగుప్రీతినెదురుగ సకలబాంధవులును
సకలజనంబులుసంతసించగా సవరించంతటను
నడువగధరణీసింగుడువచ్చి విడుదులుజూపించి
కడుమేలునునగుసుముహూర్తంబునకల్యాణంబొనరించి
బంధుమిత్రులబ్రాహ్మణజనముల బహువిధములమన్నించి
సైంధవమ్ములుగజములురథములు సరగవారికిప్పించి
మరియునుగల్గినభటాదులను మరిమరిప్రియమంద
సరగనొనర్చియుధరణీసింగుడు చాలవేడ్కనొంద
దేసింగునిమామయుతానంతట దివ్యరథంబులును
వాజీమీరగుఱ్ఱంబులుగజములు వరుసధేనువులును
కూతునకరణంబిచ్చియుతనదగు గృహంబుజేరుటకు
ఖ్యాతిగనేగెనుబంధులవీడ్కొని కడువడిపురమునకు
అంతసంతసంబునదేసింగుడు నార్యులగొలుచుచును
పంతముమీరగపరిపాలించెను బంధులమిత్రులను
ఈరీతినిసుఖమొందుచుచెంజీలో సారెకునందరును
భూరిసంతసంబొందుచుండిరని నారదుడనగాను
వినిసురనాథుండతిమోదంబున వేడ్కలుప్పతిలగా

ఘనుడగు వారదుజూచి పల్కెను కడుప్రీతితో వేగా
అవలికథ యేమాయెను దెల్పుము అనిబోనముసామి
సావధానముగ జెప్పెద వినుమా సకలము జేజేసామి

{ఢిల్లి పాచ్ఛా తనకొమార్తెను సాదుల్లాఖానునికిచ్చి
పెండ్లి చేయించుట.}

సంతోషంబున ఢిల్లీపాచ్ఛా స్వంతకూతుకిని
అంతట పెండిలి చేయగవలెనన యాదట వలచెను మదిని
తనప్రధానియా రాజలింగని తప్పక ఘనుడు జూచి
ఘనముగ పెండిలి సేయగ మనమున కడు నిశ్చయముంచి
ఉన్నవాడను పట్టణమెల్లను వొప్పుగ వేడ్కగను
యెన్నోవిధముల శృంగారింపగ యిపుడు బంపుమనెను
కనకమయంబులు మణిమయములునై కడు శోభిల్లగను
దినకరు తేజము మీరు కాంతిని తేజరిల్లగను
వాద్యఘోషములు మ్రోయుచునుండగ వరుస వీధులందు
చోద్యము గానగ కెల్లను మరిమరి సొంగసు జేసియందు
సాదుల్లాఖా సాహేబునప్పుడు చయ్యన బిలిపించి
మోదముతో దనపుత్రికి పెండిలి ముదముతో చేయించి
అల్లునికిని కూతురికిని యప్పుడు అధికధనములిచ్చి
కొల్లలు గా నేనుంగులు హయములు కోర్కెదీరనిచ్చి
కోరిన వస్త్రంబులు భూషణములు కొంత సైన్యములను
వారికి దాసీదాసజనంబులు వరరత్నంబులను
వ్రాసియిచ్చె నఫరమానా యొక రాజ్యమేలుమనుచు
వాసిగ కూతురికల్లునకిచ్చెను వరుస వేడ్కజూచు
నూటయెనిమిది పాళెల్తుకుడీ నేటుగ జేయించి
వాటంబుగ తనకూతురికి కరణము దీటుగనిప్పించి
సాదుల్లాఖానుండగు తనయల్లుని చక్కగాను జూచి

మోదముతో నార్కాడు మేలుమన ముదముతోడ వచ్చి
సాదుల్లాఖాన్ సాహేబు యెంతో సంభ్రమంబుతోను
ఆదరమున దన వారితో గూడి యార్కాడ్జేరగను.
(సాదుల్లాఖానుడు ఆర్కాడు యిలాకాకు ప్రభువగుట.)
ఏడులక్షల పరాణీలను మేరుపర చేః పుడు
వాడిమిగల తేగా బరిశీలను వారికిచ్చెనపుడు
భావస్యమీరుల నరప్పించియు పట్టముకట్టించి
ధావళ్యంబైనట్టి కేతనము తప్పక నెత్తించి
భాల్లే మలేరహిమాన్ తురుపులు భర్తీ చేయించి
ముల్లా శాస్త్రము పద్ధతి వారికి మూలము జెప్పించి
నమ్మకహరాం నైకర్నా యని నమ్మిక పుట్టించి
ఉమ్మరుఖాన్ అనియెడివానిని వుజీరుగానుంచి
బారకాసు బంగాళాలయనులు బాగుగ గట్టించి
చారుఘనాపరి చేరిగోడలు చాలుగ బెట్టించి
ఢిల్లీమక్కాదర్వాజాలు ఠీవిగ నేర్పరచి
ముల్లాఫకీరుహిమామాముదిజ్ఞు మూలల గావించి
తక్తుమహలు బల్ శాడీమాడీ దర్బారుగనుంచి
యుక్తముగాను దివానుఖానాలూ జీనతంబు జేసి
వీధివీధులను మసీదులెల్లా వెలుగుచుండగాను
బాదరువృంరావూఖజీల్ నమూజు జేయుగాను
యగఫరుఅల్లాఖుదాయటంచు నచట వేడగాను
నిగనిగమని కందీలు గుళ్ళోంబులు ధగధగ వెలుగగను
భాటిగ నవలాక్ తోట బెట్టెబాహాటముగా గాను
నేటుగ తానుకోట జేరి బల్ వాటము మీరగను
రోజీనాలుకై జీతములు రూఢిగనిచ్చుచును
ఆజూబాజూ పల్లెలయందు అముల్దార్లనుంచుచును

సుబాయారికా డేలుచునుండే నబాబుసాదల్లా
సభామధ్యమున తాగూర్చుండి జాగ్రతతో సెల్లా
కిల్లేదారులజాగ్రత జూచి కిలకిలయనినగుచు
బల్లేయినాములపుడిప్పించి బైటోజీయనుచు
తాజీతవాజములివ్వగాను తానే ప్రభువుగను
నాజర్ మొదగును ద్యోగస్థులు నయముగగొల్వగను.

(సాదుల్లాఖానుడు పరగణాలెక్కలు తనికీ జేయుట.)

సౌకన్నను జూచప్పుడు పల్కెను నబాబుదొరగారు
లీకావటుయామునద్దీలను లెక్కలడిగినాడు
సీమామూలపుజమీందారుల సెల్లుబాకీలేమి
జాములోపల తయారుచేసుక జాగ్రత గారమ్మి
తుదమొదలుగ లెక్కలు తానెరుగును తోండ్రమల్లోజీ
ముదమున బిల్వగ బంపుండనగను ముందుగాను ఖాజీ
చోప్దారులనుగనుగొనియప్పుడు జోరుగనాతనిని
మాప్దల లేదు తోండ్రమల్లోజీ మలగకు వేగమని
తోడుకరండని సాదుల్లాఖానుడు తుర్యముగానపుడు
పోడిమితోడుతబల్కగవారలు పోయిపిల్వనపుడు
తమకంబున జోడంగిల్లాడికియు తలపాగాబెట్టి
నమూదువైనాజల్లరుపటాక నడికట్టుగగట్టి
కొలువైయున్ననబాబుకడకు గొబ్బునవచ్చియును
సలాముచేసి భయభక్తులతో చెంగటనిల్వగను
తోండరవలదికబైటో బైటో తోండ్రమల్లోజీ
ముందుగాను పాళెంబులబాకీ మొత్తములేర్పరచి
అరనిమిషములో బాకీలెక్కలు మెరుగజెప్పుతరిచి
ధొరతోనప్పుడు మనివిజేసెనా తోండ్రమల్లోజీ.

తోండ్రమల్లోజిన బాబుకి స్త్రీవసూలు లెక్కలు
వివరముగా తెలుపుట.

తప్పక లెక్కలు శోధించితిమి తప్సీల్ వారిగను
యిప్పుడు నెంబరు చొప్పున మీకు యిక వివరించెదను
చేతిపట్టు దావుత్ఖాన్ బాకీ చెల్లియున్నదిపుడు
పాత పాళెపు జహగీర్ దారుడు బాకీ లేదిపుడు
కల్లకురంజి ఖాన్ సాహేబు కాసు బాకి లేదు
కల్లికోట మహమత్ ఖాన్ బాకి చెల్లుబెట్టినాడు
అరియలూరి పాళేగార్ బాకీ యరకాసును లేదు
తిరుణామల మేల్ సుభంగదొరయును తెలియ బాకి లేదు
దిండికల్లుకోలు మొక్తాన్ బాకి తెచ్చి చేర్చినాడు
బండికోట జాగీర్ దారుడు బాకి తీర్చినాడు
చెంగల్పట్టు జమీన్ దార్ బాకీ చెల్లిపోయె నేడు
మంగళపేట సుభేదారుడు మన బాకి యిచ్చినాడు
వెంకటగిరి బంగారు నాయుడు యింక బాకి లేదు
శంక లేక మళయాళపు రూకలు సరిగ వచ్చె నేడు
కలవకోట మేల్ సుబేదారుడు కాసు బాకి లేదు
చెలువుతో కాళహస్తి పైకము చెల్లించిరి నేడు
తిమిరికోట మేల్ షేకు మహమ్మదు తీర్చి వేసినాడు
అమరిన కార్వేటి రాజు వారును అరయ బాకి లేదు
ఆరణి వేంకట్రాయల వారును అరయ బాకి లేదు
నారగంటి పాళెంబున బాకీ యారయంగ లేదు
మొగరాల్ పాళెపుకి స్త్రీరూకలు ముందే చెల్లినది
మొగలి పాళెగార్ పైకము మనకు తగరారన నేది
నిలిచిన పాళాల్ పైకము బాకీల్ నేటివరకు లేదు
చెలువుగకి స్త్రీకట్ట లేదు దేసింగు రాజు వారు

చేయుచుపంౘ్రడెండేడులనుండియు చెల్లించడుపైకమును
యీమెడవానినిమట్టుబెట్టుటయె హితమనియనగాను
కన్నులమిక్కిలినిప్పులురాల్చుచు యున్నతుడై యంత
పన్నగసాదుల్లాఖానుడు డుగ్రుడై పలికెవానికంత
శాబాస్ వహ్వాబాగజెప్పితీ సారిపల్కవోయి
యీబాకినిక్షణమైనా సేనట యికనునిల్పనోయి
అనుచుమీసముల్ దీటుచుహుక్కానప్పుడుపట్టుచును
కనుబొమలదరగభుజములుగదలగ ఘనముగబల్కుచును
గుప్పుగుప్పుగుప్పునితనకన్నుల నిప్పులురాలగను
అప్పుడుపండ్లను పెటపెటపెటపెట యనుచునుగీటుచును.

{ సాదుల్లాఖానుడుతోండ్రమల్లునిసైన్యసమేతముగా
చెంజికోటకుబంపుట. }

మనకునుపైకముకట్టకయుండే మదగర్వంబేమీ
తనకును చెంజీకోటయినాము దక్కనయికనుసుమీ
అనుచుమంత్రియాతోండ్రమల్లునికనుగొనితానపుడు
దినములుమూడునుగడువిచ్చితిమి తీవ్రనుగానిపుడు
చెంజికోటకునుపోయిపైకమును శీఘ్రింబుగదెమ్ము
పంజవైన దేసింగునినీవిటు పట్టికట్టితెమ్ము
అనికోపముతోనబాబుసాదుల్ ఖానుడుపల్కగను
వినియునుతోండ్రమల్లొజప్పుడు వినయముతోడుతను
పూనిసలామటుచేసినబాబును పొడగనియిట్లనెను
పూనికతోడుత చెంజికోటకును పోయివత్తుననెను
మూడువేలగుఱ్ఱంబులరౌతుల నేడుపటాళముల
వాడిమిగలతేగా బరిశీలను జోడాభేరులను
ఏనుగులుక్ విల్బండ్లునొంటెలును హెచ్చువాద్యములను
సేనాధిపులుఖజానాదారులు నానావిధములను

సకలమైనసంభారంబులును చాలరొక్కములును
వొకటియుతక్కువలేకుండగనా కొప్పగనిచ్చినను
శీఘ్రముగాను చెంజిలొమనకు జేరుపైకమంత
జాగ్రతగాగొనివచ్చెదఋాడుడు చాలగనొకవింత
పట్టికట్టెదను దేసింగునిబల్ పారాలుంచెదను
గట్టిగనిర్బంధంబుతోడను ఖడిదీచేసెదను
మించినయధికారము వానైపనడిపించెదనచ్చటను
మించియున్నొకవేళలొవానట ద్రుంచెదతేగతొను
ఇటులపల్కినతోండ్రమల్లుని యింపుతోడజూచి
చటులపరాక్రములయినబలంబులసరగనివ్వలేచి
తోడుగూడుకొనిసలాము జేసి తోండ్రమల్లోజీ
నేడుకతోడను త్వరమివ్వగ విడిదికినతడొచ్చి
నిలువంగిల్ దొడిగియుతలపాగా సేర్పుగానుజుట్టి
జలతరుపేటుధట్టీనడుముకు చక్కగానుగట్టి
తళతళమను బేష్కబ్జానంతట ధట్టిలొనజెక్కి
నిలువుటద్దమునుజూచిమీసముల్ నెరయదీటినిక్కి
చేతులబత్తీసాయుధంబులను శీఘ్రముగాబట్టి
ఖ్యాతిగనేనుగునెక్కి సేనను గదలగనిలబెట్టి
పెంపుగధణధణధణధణయనగను భేరీవేయించి
గుంపుగపటపటపటపటయనగను గుఱ్ఱాల్‌నడిపించి
కత్తులుధగధగధగధగయనుచును కాంతులుశోభిల్ల
తత్తరమందుచు నెల్లజనంబులు తరుచుగభీతిల్ల
ఇలాతలంబిట్టట్టుగదలగా చేవుమీర వేగా
కలకలకలకలకలకలమనుచును కాల్బలములురాగా
వేంద్రంబుగబలములనడిపించెను తోండ్రమల్లోజీ
తీంద్రించుచునుగదలెనప్పుడా తోండ్రమల్లోజీ

అనినారదమునివరుడప్పుడుతా నానతియ్యగాను
వినిదేవేంద్రుండతనితోడుతను వెరగుననిట్లనెను
మునినాథావినవింతగనున్నది ముచ్చటజూడగను
పనియేమీయీనబాబుచెంజికి పైకమడుగుటకును
కోరిఢిల్లిలో దేసింగురాజు గుఱ్ఱముపై నెక్కి
సారెకుస్వారీచేసినప్పుడు చయ్యనమదిసొక్కి
తెగువతో పాచ్ఛా చెంజియినాము దేసింగునికిచ్చి
తగపంపగనా దేసింగుడుతా మగుడచెంజికొచ్చి
యేలుచునుండగయీనబాబునకు యిపుడుబాధ్యమేమి
మేలనిచెంజీపైకమునడుగగ మేరమీరనేమి
కారణమున్నదికడువడిదెల్పుము నారదమునివర్యా
కోరెదవినగావారిచరిత్రము గొనకొనిధీవర్యా
చెప్పుమన్ననాయింద్రునిజూచి యప్పుడిట్టులనిమెఱ
తప్పకనారదుడావిధమెల్లను తడయకవినుమనివెఱ
సురనాయకయాఢిల్లిపాదుషా సొంపుమీరగాను
గరిమెతో చెంజిని దేసింగునికి వరుసయినాముగను
ఇచ్చిమరచియునల్లునికీనిసూ యెనిమిదిపాళెములు
మచ్చికతోఫర్మానావ్రాసి మరియునిచ్చెమేలు
ధర్మము నెంచకతటుకునసప్పుడు తనమదిమూఢతను
ఫర్మానాలోజేర్చెను చెంజియు పదపడిజూడగను
గరిమెతో సాదుల్ఖానుడు పైకము కట్టలేదటంచు
అరయగదేసింగునినడుగుటకా దరువిదియేయనుచు
నారదుడిట్లని చెప్పినయాపా కారిమదినియోచించి
సారెకునల్లునికెటువలెనిచ్చెను చయ్యనపాచ్ఛామెచ్చి
మరిచెప్పెదవినుసురనాయకయా తురకదొరతనమున
యిరుకునదగులుటతెలియగలేరు యెట్టిదొరలునైన

అని చెప్పినమునివరుమాటలువిని యంతనింద్రుడని యేఁ
చనెనుగదాయాతోండ్రమల్లుడా పనియేమిగనయ్యేఁ
రూఢముగాఁ దెల్పుమునీవనగా ద్రుహిణపుత్రుడని యేఁ
గాఢముభేరీశబ్దముతిమిరికి కడువడివినబడి యేఁ.

(తిమిరికోట శేఖుమహమ్మదుతోండ్రమల్లునిజూచుట.)

తిమిరికోటయేల్ శేఖుమహమ్మదు దిగులుజెందిలేచి
క్రమముదప్పిపరులెవ్వరోమనపై గదసిరనుచుచూచి
మూడువేలగుఱ్ఱంబులనప్పుడు మోహరంబుజేసి
తోడనెమున్నూర్పఠాణిరౌతుల తోడుగానుజేసి
కత్తికట్టుకాల్బలములనెల్లను క్రమముగానునుంచి
బత్తీసాయుధములుతానప్పుడు భళిగధరియించి
తానొకబారాహజారి నెక్కి కదండునుగదలించి
పూనికతోజనితోండ్రమల్లుని పొందుగానుజూచి
ముందుసలాముచేసియునిలిచి యందుసేమమడిగి
తొందరసేయగవలవదటంచును తోండ్రమల్లునడిగి
మొన్నటివరకునుబాకీరూకల ముడుపంపితినిన్న
నిన్నటిలెక్కలుయివెనన్నిప్పుడు మన్నించగదన్న
యిదియునుగాకనునాపైతప్పులు యేమియున్నవన్న
కదలియిపుడునాకోటపైకిరా కారణమేమన్న
అనియీవిధముననడుగుచుభయమున నడుగులుతడబడను
కొనియాడుచుమరివేడెడితిమిరి కోటమహమ్మదును
గజిబిజిమాన్చితోండ్రమల్లుడు గ్రక్కుననిట్లనెను
నిజముగశేఖుమహమ్మదువచ్చుట నీపైగాదనెను
చెప్పెదవినుముచెంజియేలు దేసింగురాజుమనకు
తప్పకపండ్రెండేండ్లపైకము నిప్పుడుకట్టుటకు
మెండొడ్డియున్నాడిపుడాతని మేరదెలియనేడు

దండుదీసుకొనిపో మెదనికనా తమాషైనజూడు
అనవిని శేఖుమహమ్మదుడంతట నతిభయమొందుచును
ఘనుడగునా దేసింగుప్రతాపము వినుమిక జెప్పెదను
బలమున నెక్కువగలవాడయ్యా బాలుడు దేసింగు
యెలమిని నెదిరించిననిమిషంబున నణచువానిపొంగు
కత్తిచేతబట్టినజగమెల్లను గడగడమనివడకు
మిత్తిరీతివైరులతాబట్టి మెలగనీక చెణకు
కండ్లనురిమిచూచినమాత్రంబున గరుగుగర్భమన్న
పండ్లుపటపటనికొరుకునంతలో పరువెత్తుదువన్న
దుడుకడురా జితసింహంబనదగు తోండ్రమల్లన్న
కడిమిని దేసింగునియెదిరించుట కార్యముగాదన్న
అనవినితోండ్రమల్లోజప్పుడు యేలయింత మాట
అనవచ్చునె నాముందర శేఖుమహమ్మదునీవిచట
వినెదవుగా నే చెంజికిపోగా వీనులపండువుగా
కనెదవునీవీమార్గంబున నే కదలిరాగబాగా
పట్టిప్రతాపము లేటికిపోయి వచ్చెదని కెవేగా
అట్టెదండునడిపించెదనంచును ఆరణిమార్గముగా.

{ తోండ్రమల్లోజీ తిమిరికోటనుండి ఆరణికిపోయి రణభేరి వేయించుట. }

పోయియారణిపొంతకు జేరి పొసగభేరిప్రేయ
మాయురెయీధ్వని యేమటంచును మనమునదిగులొలయ
రయమున వేంకట్రావును శ్రీధర రావును నచ్చటను
నయమున శ్రీనివాసరావుతో నచటదురుండియును
పిడుగురీతినున్నదియీనాదము ఫెల్లుఘోరముగను
గడగడవడకెడు కాళ్లుచేతులును కడుభయమొందెడును
కారణమేమొ తెలిసియువేగమె కట్టాయత్తముగా

బారహజారులగొని తెండిప్పుడె పటురయమునబాగా
అనియిట్లారణి వేంకట్రాయలు తనపరివారమును
చనునటులాజ్ఞ యొసర్చియు తానుచయ్యనకోటమహల్కు
శ్రీధరరావు మొదలగువారితో శీఘ్రింబుగ నెక్కి
యీధరబగులగ భేరివేయుచును యేపుమీరనిక్కి
చూచుచుదిక్కులు పిక్కటిల్లగా సొంపుతోడనపుడు
యేచివచ్చు సేనలధైర్యంబున జూచివారలపుడు
పరాయిరాజీదెవచ్చెనుకోట పైకిచూడుడనుచు
పరాకులేకనుబారహజారులబిరాన తెండనుచు
అప్పుడందరుతమతమగుఱ్ఱములలఫున నెక్కియును
తెప్పునబలములుతముగూడుకొని తెరువనడువగను
పదివేల్ రౌతులగూర్చుకబందోబస్తిగాను తాను
కదసియు వేంకట్రాయలుతనచేకత్తిమెరయగాను.

(ఆరణి వేంకట్రావు తోండ్రమల్లోజినిపొడగాంచుట.)

ఎదురుగబోయితోండ్రమల్లుని యేమరకనుజూచి
యిదియేమియిటురా కారణమని యిపుడనుచునుజూచి
తుదమొదలేమోమీవచ్చుటకును తోండ్రమల్లోజీ
సదయతజెప్పుముసంగతులెల్లను చయ్యనమల్లోజీ
అనుచునువేంకట్రావునమస్కారంబుచేయగాను
వినయముమీరగతోండ్రమల్లుడును వేగమెయంతటను
బదులునమస్కారముతాజేసియు కుదిరికెతోడుతను
చెదరకనిల్వగ వేంకట్రాయలు ముదమునవిట్లనెను
నిన్నటివరకును లెక్కలుతీర్చియు నేనుబంపినాను
యెన్నసేటిపైకంబుముల్లెయును నేడేపంపెదను
ఇటులనుండగా భేరీవేయగ నేమికారణంబు
తటుకునదెల్పుముతోండ్రమల్లనదాచకనునిజంబు

తోరంబుగ నాతనికిట్లనియెను తోండ్రమల్లోజీ
వేరే మేము వచ్చిన విధము వేంకటరావోజీ
చెప్పెద నేను సవిస్తరంబుగా చెంజికోటలోను
వొప్పుగ పండ్రెండేండ్లపైకము వున్నదియచ్చటను
కట్టలేదు దేసింగుడు మనకు కాసైననుయిపుడు
మట్టుమీరియున్నట్టివానిదగు మదగర్వము నేడు
చూచిపైకమును దెచ్చుటకై నే సొంపుగపోయెదను
నీచుడైన దేసింగునిబట్టియు నిటకు దెత్తునేను
ఆమాటలువిని వేంకట్రాయులు నాతని చర్యలును
సామాన్యంబని యెంచగతగదిక చయ్యాన జెప్పెదను.

{ తోండ్రమల్లోజికి ఆరణి వేంకట్రావు
దేసింగురాజు ప్రభావమును దెలుపుట. }

తల్లిదండ్రులే డెనిమిదియేండ్లకె చెల్లిపోయినారు
పిల్లవానిపినతండ్రియు సాకి పెండ్లి చేసినారు
ఇరువది రెండు యేండ్లవాడయా యిప్పుడు దేసింగు
సరియగుదు రెసుందరమున భువిలో చక్కదనాల్రంగు
గరిమెతో వానిపరాక్రమములనీ కెరుగ జెప్పెదను
యిరువుగ దేసింగునకును సరిశూర్లెవరు లేరు యికను
పదివేల్తులముల యెత్తుకత్తిచే పదిలంబుగదాల్చి
పదపడియెనిమిది వేలతులంబుల బాలా ధరియించు
మూడుమణుంగుల షేష్కబ్జాతన మొలధట్టిని జెక్క
గాఢంబగువక్కజిరాదోడుగుక రూఢిగాన సిక్క
ధరగలవస్త్రాదులలోపలను తనరుమేటివాడు
అరుదుగ దేశాధీశులకెల్లను అరయపోటువాడు
ధిక్కరించిచూచినమాత్రంబున నుక్కుగుండ్లుపగులు
చక్కగనిలిచిన వీరులగుండెలు ప్రక్కలుగానొగులు

దేవలోకమందుండివచ్చిన తేజతనికిగలదు
ఆవిధమంతయు దెల్పెద నెచ్చట నేవినకనలేదు
గోగుపక్కిరిఢిల్లినబాబుకు గుఱ్ఱముకొని తెచ్చెఁ
బాగుగనాగుఱ్ఱంబిగలించిన తూగిసేనవిచ్చెఁ
పాచ్ఛావప్పుడు మూర్ఛతెప్పరిలి పక్కిరినిజూచి
అచ్ఛాబహాదర్ ఘోడాతుంకోఁ అనగవాడు లేచి
సలాంమహారాజ్ పాచ్ఛాయిదిగో సలామయ్యానీకు
హాలేమాఁ తుర్పిచ్చెదబహుమతి యానతీయుమాకు
రహీమీరగబహుమతిపక్కిరికి రాజలింగబాబు
సహాజంబుగనిప్పించివేడ్కతో సరగునపనిచెనబాబు
వాసిమీరనీగుఱ్ఱము నెక్కను గాజలింగబాబు
దేశాధీశులబిల్వబంవుము రాజలింగబాబు
అనియిటుపాచ్ఛావానతీయగా రాజలింగబాబు
పనిచెనుహార్కారులదేశములకు రాజలింగబాబు
అప్పుడువచ్చిరిపాళెగారులాహాయనునుజూడగను
వొప్పుమీగగావచ్చియువారా మెప్పులగుఱ్ఱమును
తప్పకచూచియు దానిగజనకు తగభయంబుజెంది
చొప్పడదీగుఱ్ఱముమాకెక్కను యిప్పుడనుచుగుంది
మొగములువెలవెలబారగనందరు మోదంబులుదరగి
వగలబొగలగా రాజలింగబా బగణితముగనెరిగి
పదిలుడయినదేసింగునితండ్రిని పరగబిల్వబంప
కదలెనుధరణీసింగునిగూడి కడునుదముజనింప
చేరఢిల్లిలోతేజినిజూచి చేతగాకనెక్కుటకు
వారిరువురుఖైదులోపడిరైదు వత్సరములవరకు
తెంపుతోడనైగేండ్లబాలుడా దేసింగుమహారాజు
సొంపుమీరతేజీపైనెక్కెను చోద్యముగా రాజు

లందరుజూడగమటుమాయంబై యైదుదినంబులకు
పొందుగదవుడాయించియునలసట పొందికనలసటకు
తనకులదైవంబగురంగేశుని దలచియురాగాను
చనువునస్వాపుయుఢిల్లిలో తేజితో చక్కగవిడువగను
ఉన్నబాలునిచోద్యముమదిలో నెన్నుచుతేజీని
పన్నుగపాచ్చాయినామిచ్చితా బంపెనురాజీని
ఆగుఱ్ఱముపైనెక్కక దేసింగంతచెంజిజేరి
భోగంబునదేవేంద్రునితీరై పొంగినాడుమీరి
దుడుకండాగుఱ్ఱముపైనెక్కిన తోండ్రమల్లన్న
గడగడవణకునుయీజగమెల్లను కదలవలవదన్న
ఉసురువున్నవుప్పమ్మవచ్చును వూరికిపోవన్న
రసికుడయినయాదేసింగునితో రచ్చలువలదన్న
ప్రత్యక్షంబుగరంగనాయకుడు పలుకుచుండునన్న
నిత్యముతిరుమణిధారులగన్నను నీతివినయుడన్న
తోడనెయామాటలుగనినవ్వెను తోండ్రమల్లోజీ
వేడుకమించెనునీమాటలచే వేంకట్రావోజీ
తిరుమణివేనుధరియించుకొని దేసింగునిగాంచి
వెరపులేకవానినియిటదెచ్చెద వేగమోసగించి
పోయివచ్చెదనుచెంజికనుచుతా ప్రేయించెనుభేరి
పాయకతిత్వరితంబునచెంజి పట్టణంబుజేరి.
(తోండ్రమల్లోజిచెంజికోటనుజూచి విస్మృతినొందుట.)
కోటలుప్రాకారంబులగడ్తలు గోపురంబులును
వాటమయినమహడీలునుమఱియు మేటొపడగలును
రచ్చతిన్నెలుసలువచప్పరాల్ రాజవీధులును
హెచ్చగబ్రహ్మక్షత్రవైశ్యులు మెలమినిశూద్రులును
తీవిమీరగావీధులదిరుగువి టీవిటజనములను

భావమురంజిల జేసెడి వేశ్యాభామాజనములును
దేవాలయములుదివ్యతీర్థములు తేజరిల్లగాను
కోవిదులచ్చట శాస్త్రాగమముల గోష్ఠినల్ప గాను
ధాటిమీరనుద్యానవనంబులు తేటతటాకములు
పాటిగ శుకపికకలరవంబులును పారావతములును
తేజమలరనవరత్నపుకాంతులు దీటుగ వెల్గగను
రాజధానియొప్పుగ విలసిల్లెను రంజితంబుగాను
చటులతరంబగుదుర్గంబును తా నటుగనితలయూచి
తటుకున వేంకట్రావు దెల్పిన దాఖల్ మది నెంచి
ఇటువిలసిల్లెడుకోటజూచి తా నెచ్చుగగొనియాడి
పటుతరముగ నేవిధమున సాధింపగల నెవరిగూడి
దండును దేవనూరిదగ్గర నుండగానుబంచి
ఖండితముగ దేసింగుతోడను కదసిపల్కవెరచి
యుయ్యాకనాలుగుదినముల దాకా నయ్యెడనుండియుచు
చయ్యనబోవుటకును తానంతట సందేహించుచును
భేరీ వేయించెనుమరునాడా భేరీశబ్దమును
సారెకునప్పుడు పాత చెంజికిని చయ్యనవినగాను
తడయక దేసింగునిపినతండ్రి ధరణిసింగుడపుడు
గడగడ కాళ్లును చేతులువడకగ కడుమోసము నేడు
ఎప్పుడు లేదీ భేరీశబ్దము యిప్పుడునిచ్చటను
తప్పక కలిగినవిధమే మోయని తడబడుచును తాను
సూటిగ మోంజాపై నెక్కియు తా జూచి గంతలోను
యేటిగట్టునదిగనదండును యేర్పడగనుగొనెను
త్వరితంబునతనతనయునియొద్దికి తర్లివచ్చువేళ
గురుతరముగ దేసింగుడురంగని కోరిపూజచాల
జేయుచుండె శ్రీహరినారాయణ శ్రీశపద్మనేత్రా

తోయజనాభ జనార్దనకేశవ కాయజహరమిత్రా
భావజజనకా పరమపురుషహరి పార్థమిత్రశౌరీ
సేవితమానిజనావనమురహర చేదినాథహరీ
అనుచునుతనపాలిటిరంగేశుని మనమలరగనతడు
ఘనముగ ప్రార్థనజేయజూచెను పినతండ్రియునపుడు.

{ తొండ్రమల్లుడుదండెత్తివచ్చినసమాచారము దేసింగునకు ధరణిసింగు దెలుపుట. }

తనయుడయిన దేసింగునిజూచి తానుబల్కినాడు
అనఘాపుత్రకవినుమొకవింత కనులుదెరిచిచూడు
కనగానప్రళయంబుగనున్నదియీ కరణిజూడనేడు
అనిజెప్పినవినకున్నతనయునికి మనవిజెప్పినాడు
ఘనిబూనియునీపూజలేమిటికి బాలుడ దేసింగు
మనము యేమరియుండినందుననూ తనయా దేసింగు
మనకోటకునిపుడపాయమువచ్చెను తనయా దేసింగు
అనయమురంగనినర్చింపగఫల మేదయ దేసింగు
దేవనూరిలోభేరీశబ్దము ధింధిమిధిమియనుచు
దావాదంబుగనబాబుదండు దడయకున్నదనుచు
మునుకొనినాలుగుదిక్కులదండుముట్టడివేయగను
మనమిప్పుడుయేమరియుండుటయిది మర్యాదాయనేను
బహుపూజలుజేయుచువినెనప్పుడు బాలుడు దేసింగు
సహజంబుగకనుదెరిచిచూచెను చాలగదేసింగు
రామురాముశేదేవామీకు రాంతండ్రిగారు
రామురాముశేతండ్రీమీరు యేమిచెప్పినారు
ఇందుకునేనుభయపడనయ్యా యిప్పుడుతండ్రిగారు
సందేహముమీకేలనిప్పుడు చాలతండ్రిగారు
అనుచుపకపకనవ్వి పలికెను అంతట దేసింగు

ఘనసింగమువలెగర్జన సేయుచు కనుగొని దేసింగు
మన్ననతో నామనవివినవయా పిన్నతండ్రిగారు
పన్నెండేండ్లపైకమిక్కడను పిన్నతండ్రిగారు
పన్నెండేండ్లగుండుమందును పిన్నతండ్రిగారు
పన్నెండేండ్లు గెరిగినకసువు పిన్నతండ్రిగారు
పెంపుగరంగేశునికృపగల్గ బెదర నేలమీరు
యింపుగరంగేశునిపూజించుచు యిపుడుతండ్రిగారు
రామరామయనునంత కాలము రాజ్యమేలుదాను
యీమహిరాజకులాగ్రణిశూరత నిపుడు హెచ్చినామ
తగుననబాబుదండుతీసుకొని తానువచ్చినాడా
తగవుబెట్టుకొనిన న్నెదిరించెడి మగవాడైనాడా
పొందగువానిపరాక్రమమెల్లను భూమిపాలుగాను
పొందజేసెదనుక్షణములోనమీ రందరుజూడగను
పులినోటనుబడిబ్రతికినవారీ భువిలోనున్నారా
తలగకమదమేనుగుతో పోరి తప్పిపోయినారా
పట్టుగపట్టికట్టెదనిప్పుడు దిట్టముగనువాని
మట్టుమీరిననుయిట్టటుకదలక కొట్టించెదగాని
కదలనీకవానిని మెదిరించెద ఖండితంబుగాను
యిదిగోనాబలమెదిరిబలంబును యికజూడంతయును
కానినబాబు నెచటనిప్పుడు కదలనీయనయ్యా
పోనీయనుయారాకటికిప్పుడు పొందుగపిన్నయ్యా
సారెకుయుద్ధంబునుచేయుటకే సందేహములేదు
నూరులూచావునారులూచావు తీరితేనువిడదు
ఘడియసావకాశముచేయుదుకని పల్కెదనంతయును
తడయకదేవరపూజకువిఘ్నము తగదుచేయగాను
అనిదేసింగుడురంగనాథునకు నర్చనజేసియును

ఘనముగ ధూపదీపాదులును కడువడి నొసగియును
సరసంబుగ నైవేద్యము లొసగియు హారతు లిచ్చియును
పరమ భక్తి నుపచారము లన్నియు పరగఁగ జేసియును
పట్టుసరిగె బల్ జామానీమా బాగుగ ధరియించి
దిట్టముగా జల్తరుపేటంచు ధట్టి గట్టి లేచి
సరిగె బుట్టాల్ పాగా బాగా శిరమునందు బెట్టి
కరముల నవరత్నంబులు జెక్కిన కంకణములు బెట్టి
వెలలేని రవలంటు జోళ్లను వేడ్క చెవుల మెరయ
చెలువు మీరగా రత్నహారముల్ సరస కాంతి నారయ
పచ్చల కల్కితురాయి దాల్చి దా నచ్చుగ శోభిల్ల
ముచ్చట వేళ్ల కుంగరములు బల్ హెచ్చుగ విలసిల్ల
శృంగారించుక దేసింగుడు బల్ సింగము వలె నపుడు
మంగళకరముగ భారి కత్తిని మరియు దాల్చినాడు.

(హార్కార్ల ద్వారా దేసింగు తోండ్రమల్లుని బిలిపించుట.)

తన కొలువులో నుండెడి హార్కార్ల నుతప్పక జూచియును
కను లెఱ్ఱగ జేయుచు కోపంబున కదసి బల్కెనటను
ఏమోయీ హరకారులార మీ రిప్పుడు వినరోయి
నామీదికి దండెత్తివచ్చిన యాతడెవ్వడోయి
పోయి శీఘ్రముగ వాని సంగతులు పొసగ దెలిసి బాగ
నా యెడకును దోడ్కొని తెండన్నను నంత వారు వేగ

(హరకారులు తోండ్రమల్లోజిని బిలుచుట.)

చని ధీరత తో తోండ్రమల్లుని చయ్యన నటు జూచి
ఘనుడగు దేసింగుడు మిము చెంజికి గ్రక్కున రా బనిచి
వచ్చినార మిక లెండు లెండని వారు బల్కె వేళ
నచ్చట నిలబడి గడగడ వడకుచు నదరుచు నట చాల

పలుకక యుండినతోం(డమల్లును పరుషంబునజూచి
నిలువగూడదికచలో భాయియన నేర్పుతోడలేచి.

(తోండ్రమల్లోజి దేసింగురాజుకడకువచ్చుట.)

పూని మొంగిలియేమి సిసున్నమున పోసగనామములు వేసి
ఘనగ నెత్తురునడిమినామముగ మానితముగ వేసి
భయముతో చెంజికిపో మెనుతోండ్రమల్లోజటు వేగ
ప్రియముతోడరంగేశునిమనమున పెంపుదలచిబాగ
తొందరతో యేనుగుపై నెక్కెను తోండ్రమల్లోజీ
కందుచుమనసునజాలిజెందుచును కడువడిమల్లోజీ
వెడలెను దేసింగునికొలువునకు విహితరీతిగాను
వడయకనచ్చుట దేసింగుండును తటుకున ప్రియముననూ.

(దేసింగుతనకొలువుననుండువారలబిలిపించుట.)

పొందుగగొందరహర్కారులను పురుషుడురప్పించి
యందమీదటనువారినిజూచి యరనీమీరుమించి
జయరాంగంగాధామునితెండిక జల్దిగకొల్వుకును
రయముగపిల్వఁడుగో పాల్సింగును రత్నసింగులానూ
రామసింగులక్ష్మణసింగులను రమ్మనుకొల్వుకును
ప్రేమమీరగా హీరాదాసును పిలిపించుండికను
ధరణిసింగును మానీసింగును కరుణసింగులాను
త్వరలోలక్ష్మణదాసుహనుసేనుని తడవుసేయకికను
పేటసిపాయిమహమత్ఖానుని పిన్నయ్యాను వేగ
నాటంకము సేయక తెప్పించుడి యరనిమిషములోన
అన్నంతటహరకారులు నేగియు నందరిబిల్వగను
విన్నంతటవారందరువచ్చిరి వేడ్కకొలువునకును
కొలువవచ్చినజమేదార్లును కోటసుబేదార్లు

చెలువంబగు దేసింగు రాజునకు చెంత జేరవార్లు
రాంరాంరాంరాం రాంరాంరాంరాం రాజా దేసింగు
మేంరాగలయీ కార్యము నరవుము మేలగు దేసింగు
సామజవరదుండగు శ్రీరంగ స్వామియు దేసింగు
ప్రేమతో నీతో పలుకున్నదురు పెంపుగ దేసింగు
అనగా వారలకెల్ల ను రాంరాం అనియెను దేసింగు
తనమదికనలుచున్నట్టి చూచెను తనరగ దేసింగు
దుడుకున నేనుగనప్పుడు దిగమెను తోండ్రమల్ల య్యా
గడగడవడకుచు రంగేశానను కదసి బ్రోవవయ్యా
కమలనాభ శ్రీహరి నారాయణ కంజనేత్ర శౌరి
అమరవందితా యనాధరక్షక యనుచు మదిని కోరి
ఉన్నవాడనునన్ను బ్రోవుమో పన్నగేంద్రశయన
కన్నతల్లి తండ్రివి నీవే నాకెన్నగ నెవ్వడన.

(దేసింగు తోండ్రమల్లుని పై కోపము చేసుట.)

పొంగుమతోండ్రమల్లో జినిచే సింగురాజు చూచి
రంగుమీరనూ కోటమీదికి రావడ మేలమదించి
ఎన్నడు నీవిద్వారి మెరుగవు డేలవచ్చినావు
నిన్నెవ్వడు పంపించిన వాడు నేరక నెవ్వడవు
నబాబుదండిటు గానేమిటికి నాదకోటకెన్న
నబబు జెప్పుముని జంపుదు నే నబబు జెప్పకున్న
ఇది గాక నురణ భేరి వేయగా నేమి కారణంబు
పదరక దెల్పుము బ్రతుకవలసినను పరగ నీనిజంబు
పరువెరుంగక నుగలువా నంబున బవిశివా లినీవు
తర వెరుంగక నుచెడు తలంపు గొని తప్పు చేసినావు
అరనిమిషంబున నీ తలదునుముదు నంచితంబుగాను
సరగున నన్నిటు బంపిన వానికి బలము గ్రుంగగాను

అని దేసింగుడు ఘనకోపంబున కనులనిప్పులొలుక
కనుగొనియును నాతోండ్రమల్లుని కదసి యంతనలుక
గర్జనతోక త్తిఝళిపించిన గడగడవణకుచును
మర్జీ తెలిసి యురంగేశుని తా మరిమరిపొగడుచును
ఈకరణిని నాపైకోపము నీ విట్లు సేయమున్న
సాకినవారలు చెప్పినపనులను జరుపక వెట్లగును
రాంరాం నాదగుమనవి వినుమయా రాజా దేసింగు
నామీదను కోపము సేయకను ప్రేమదయనొసంగు
కొంచెముగా నామాటలు వినుమీ వెంచగ నిప్పుడును
మించిన బాబుకు నూటయెనిమిది మేటిపాళెములును
కిస్తీరూకలు కొదవలేక ప్రశస్తతనందరును
సుస్తి చేసియా చెంజికోటలో దస్తునిలుపగాను
ముందుగ బాకీరూకలు యిరువది రెండేండ్లవికలవు
దండిగ పాత చెంజికిపోయి తడయకిపుడు నీవు
బాకి తెమ్మని సాదుల్ ఖానుడు పంపినాడు నన్ను
తేకువ చెడి నీమరుగుజొచ్చితిని దేసింగుడ నేను
సంగము వలెకను బొమలుగదలగా చీదరగొట్టుచును
బంగరువారర పైచెక్కిన రత్నాల్ బరువడి మెరయగను
తెగువమీరిన కత్తినిదూసిన దేసింగుని చూచి
తగవు మానియా తోండ్రమల్లుడు తప్పకపుడు లేచి
శరణు శరణు నను కాపాడుటకిది తరుణము మహారాజా
గురువటంచు నీమరుగు జేరితిని ధరణిసింగురాజా
అనుచును ధరణీసింగుని మరుగున కరుగగాను జూచి
పినతండ్రిని శరణంబు వేడెనని పెను కోపమునడచి
దుర్బుద్ధీ నిటు పల్కగ నగువా తోండ్రమల్లన్న
నిర్భయంబుగా యెదుటను నీవు నిట్టులాడుచున్న

తొడరిచంపకగాపాడుడునా తొండ్రమల్లన్న
తోడిబడినాపినతండ్రిమరుగుజన తొండ్రమల్లన్న
చావకబ్రతికితివీసమయంబున చక్కగవినుమన్న
ఆవలిసంగతిజాబువ్రాసెదను తీసుకపోవన్న

(దేసింగురాజు సాదుల్‌ఖానునికి జాబువ్రాసియిచ్చుట.)

నీవలెసాదుల్‌ఖానుడువచ్చిన నేడుచచ్చునన్న
సావకాశమువలదునబాబును చక్కరమ్మనన్న
ధైర్యముకలిగినమానవుడైతే తర్లిటురమ్మనుము
శౌర్యముకలిగినశిపాయి గాయితే జల్దిగరమ్మనుము
మీసముకలిగినమగవాడైతే వాసిమీరమనుము
దేసింగునికత్తిమొనరూకలు తీసుకపొమ్మనుము
కినిసినచేపలనమ్మెడిలబ్బెకు కిస్తికట్టులేనో
మొనసీసుబేదాశ్లోకడనైనా ముల్లెలంపగనైనో
ఈసారికిపోయినసారారికె యెలమిపండినాది
తీసుకపోవచ్చునుయీకసువు వాసిగనున్నాది
కోటకువెలుపటగుండురాళ్లను గొంచుకపొమ్మనుము
యేటియిసుకయున్నది యెంటెలపై నెత్తుకపొమ్మనుము
వరదవచ్చినప్పుడుయీయేటిలో బురదనిలిచెమెండు
పరువునకపదగనెండిచెక్కలై పడియున్నవిగొనిపొండు
పరుసగవెండ్లనుగోనెలమోపుల నొప్పుగగొనితెండు
పెరికెలునిండించుకపోవచ్చును త్వరగమిగూడుకరండు
అనిపలికియుకలకలమనినవ్వుచు నప్పుడుదేసింగు
పనివడిజాబటువ్రాసియిచ్చెను పటుగతిదేసింగు
చుడుకునవ్రాసినజాబుతీసుకొని తొండ్రమల్లుడును
గడగడవడకుచుమూర్ఛజెందియు క్కడనుశవమువలెను

పడిమూర్ఛిల్లియు తెప్పరిల్లుకొని బహుశోభితిగను
విడిచియుంచుట నేనెప్పుడు నేగును పుడమీశునికడను
కనలుచున్న దేసింగుని మోమును కనుగొనియంతటను
మనమలరగ శ్రీరంగేశాచ్యుత మాధవయిప్పుడను
రక్షించిన నేబో యెదగదలీ రంగనాథస్వామీ
లక్షవిప్రులకు నన్నము బెట్టెద రంగనాథస్వామీ
రంగుమీరగోదానములిచ్చెద రంగనాథస్వామీ
అంగముతో నారాడు జేర్చును రంగనాథస్వామీ
శృంగారంబగు వస్త్రములిచ్చెద రంగనాథస్వామీ
మంగళకరమగు భూషణమిచ్చెద రంగనాథస్వామీ
ప్రాణలుడిగని జీవమాయెను రంగనాథస్వామీ
ప్రాణములను కాపాడుమిప్పుడు రంగనాథస్వామీ
ఇటుధ్యానించినతోండ్రమల్లుని గనెనంతట పేమిఞ
పటుగతిపకపకనగ దేసింగుడు పల్కెనప్పుడు కూమిఞ
ముకరాంకునిజనకునిదలచగ నినుమని చెత్తెలియుమనేను
యికనొకమాట నేను చెప్పెదను యింపుమీరగాను
నీవువచ్చినటుల బాబువచ్చిన నేపోనివ్వనురా
కావునవానికి నీభయపడరా కాసిరమ్మనురా-నీ
నెత్తితిరుమణికి భయపడితిరా నిన్ను నేనుయిపుడు
మొత్తి కాలుబట్టీడ్చి వేతురా నెత్తిపగల నేడు
జోకతో రంగస్వామినిదలచగ సాక్షి నిలిచిరారా
లేకుంటే నీ ప్రాణముతీతును ప్రాకటముగ పోరా
అప్పాటలు వినితోండ్రమల్లుని కప్పుడడగెపొంగు
రాంరాంరాంరాం రాంరాంరాంరాం రాజాదేసింగు
రయమున వానిపై కోపగించకు రాజాదేసింగు
భయమును జెందియు న్నానయ్యా బలియుడ దేసింగు

(తోండ్రమల్లుడు చెంజినుంచియార్కాడుకు బోవుట.)

పోయెదనయ్యా కోటవిడిచియిం పొందగను వేగా
నాయెడనున్న జమేదార్లు తానంత జూపిచాగా
ఏనుగుపైని గుఱ్ఱపైని యెక్కలేనసుమ్మీ
కానక నార్కాటికి పోవుటకై పాలకీని తెమ్మీ
పసగ మూడుదినాలపైనమై వస్త్రిమి చెంజికిని
ఒరుసుగాను యీరాత్రికి నార్కాడురువడిగనవేని
ఒప్పదు నామది త్రిప్పలబడి యేడి నోరలజొచ్చె వేను
యిప్పుడె ప్రాణము వెడలునటంచని యేన్నుదునగనగస
పన్నుగ నాతండంత టవడిగా పరుపిడదోడగగను
క్రన్నన సాయంకాలంబునకును కదః నగేనలను
వన్నెమీర నార్కాడు చేరెను పరుసగ నంతటను
నున్నతమగు నార్కాడు చేరగా జరచిరి భేరియును
భేరీశబ్దము వినెన తటను నబాబుసాదుల్లా
వారా బంగార్నాయని జూచియు మరిమదిః లసిల్ల
పరువడి చెంజిరూకలువచ్చెను బంగార్నాయుడా
పరిపించుము చౌకము జముకానా బంగార్నాయడా
పరగ సరాబును బిల్వబంపుము బంగార్నాయడా
పరికింపగదీ పాల్ జెట్టింపుము బంగార్నాయడా
అనగా బంగార్నాయుడు కడువడి నట్టెయొనర్పగను
తనమిత్రులతో గూడ క్రియమున తగు వేషముతోను

(తోండ్రమల్లోజి నబాబువద్దికి వచ్చుట.)

చదురుతీరి కూర్చుండెను నబాబు సాదుల్ఖానూడు
కదసి తోండ్రమల్లోజి వచ్చియాటు యెదుటనిలిచినాడు
నోడ నేసలాంజేసెను నబాబుకు తోండ్రమల్లన్న
పేడుకబదులు సలాము జేసెను వెలయ నబాబన్న

ఉలవలు దంచినరోకలివలెనే యూరకనిలుచున్న
తలచిన కార్యంబేమాయెనుయిక తప్పకబలుకన్న
చెంజిరూకలు యేమిచేసితివి చెలువుమీరనిపుడు
పంజమైన దేసింగు డేమని పలికినాడుయిపుడు
చెప్పుము వేగ మొతోండ్రమల్లనా చెలువుమీర నేడు
తప్పకమీదటి కార్యము నేను తలచెదనికజూడు
రూకలు లేదుకాసులు లేదు రూఢిగానునచట
తేకువతో దేసింగునిసరియౌ ధీరులు లేరచట
నూటయెనిమిది పాళెగాండ్రను సేటుగజూచితిని
పోటరియగు దేసింగుచేభంగ పాటులుగంటిని
భళిభళి యేమని చెప్పుదుచచ్చి బ్రతికివచ్చినాను
తులువమైన దేసింగునిచేతను తొందరబడినాను.

(తోండ్రమల్లన్యానబాబుకుజాబుయిచ్చుట.)

జాబువ్రాసెనిపేరని దేమోనబాబుసాదుల్లా
బాబువారిగాజూడగదెలుసును నబాబుసాదుల్లా
దుడుకుననిట్లనిజాబుయిచ్చెను తోండ్రమల్లోజీ
బడేకణమురంగపిళ్లను తడయకపిలిచెనుఖాజీ
వ్రాసియిచ్చినజాబుజూడుమో రంగనాథపిళ్ల
వాసిగజాబునుచదివిచెప్పుము పరుసనర్థమెల్ల
అనవినికడువడిరంగపిళ్లతా నపుడుజాబుచూచి
కనలుచుతోడనె తలవంచుకొని తనదగుమైమరచి
ఇటువలెనుండినరంగపిళ్లను యెలమితోడగాంచి
తటుకునదెల్పుముజాబుసంగతిని దాచవలదుమించి
రెండుగడియలకులోపల చెంజిని పిండిగజేయింతు
దండియైనదేసింగునిపట్టి తలతెగనరికింతు
అంతఃపురకాంతలనేబట్టి యాటచెరవేయింతు

పంతంబున నాపోటరులను నే బద్ధులగా వింతు
జాబుననుం దేవతర్జమానముల సవిస్తరంబుగను
బాబురె తెల్పుము రంగపిళ్ల యిక పటుతరంబుగాను.

(రంగపిళ్ల జాబున నుండు సంగతులు వివరించుట.)

అనినన బాబుతో రంగపిళ్ల తా నప్పుడిట్టులని యెంచె
వినుమిక జాబునగల వృత్తాంతము వివరంబుగ ననియెంచె
నీవు వచ్చినటుల బాబు వచ్చిన నింక బ్రతుకదన్న
నావకాశమిక వలదు నబాబును చక్కరమ్మనన్న
ధైర్యము గలిగిన మగవాడైతే తర్లి వేగరమ్ము
శౌర్యము గలిగిన శిపాయివైతే జల్దిగ నిటురమ్ము
మీసము గలిగిన రోసరివైతే వాసిమీర మనసు
దేసింగునికత్తిమొనరూకలు తీసుకదగ బోమ్ము
కనిసిన చేపల నమ్మెడిల బ్బెకుకి స్తికట్టవలెనో
మొనసిసు బేదాళ్లెక్కడనైనా ముల్లెలంపగనేనో
ఈ సారికి పోయిన సారారికె తెలమినిపండినది
తీసుకపోవచ్చు నయీ రాకసువును వాసిగనున్నయది
కోటకు వెలపట రాళ్లగుండ్లను కొనివేగ మెపోమ్ము
యేటియిసుకవున్నది వాం టెలపై నెత్తించుకపోమ్ము
పెంకెలు నిండించుకపోవచ్చును సరగున వచ్చినను
స్తిరముగనున్నదియీ పదార్థములు చింతలేలకొనను
ధీరత లేనియాడది వైతే ఢిల్లికి వేగ మెపోమ్ము
వారకయీ భావము నాజాబున వ్రాసి యానురమ్ము
అచ్చుగ నామాటలు విని నాడా నబాబు సాదుల్లా
హెచ్చిన కోపముతో డమండుచును నచ్చటివారెల్ల
వినగా బంగార్నాయనిజూచి కనుబొమలదరగను
కులనెల్లగను కాపగప్పగను కడుంకడి పదరుచును

తనమదికోపము తారసిల్లగా తానపుడిట్లనెను
వినుమో బంగార్రాయడయిప్పుడు వేగిరంబుగాను
అనికివలయుపనులెల్లనిపుడు నాయుత్తముతోడుతను
కనుగొనువారలగుండెలదరగా కడుకోపముతోను
పరగగుఱ్ఱములరౌతులదెమ్మను బంగార్రాయడా
బరువడిఫంకా వ్రేయబంపుము బంగార్రాయడా
రంగగురుఝుండాలెత్తుమిప్పుడే బంగార్రాయడా
పొంగణంచెదను దేసింగనినే బంగార్రాయడా
అనియిటుబల్కుచునబాబప్పుడు అతివేగముతోను
ఘనమగుకోపముకడువిస్తరమై కారుక్రమ్మగాను
అంతటకత్తినిదూసిపట్టెదగ నబాబుసాదుల్లా
పంతముతోమీసంబాడవేసెను భయపడప్రజలెల్లా
పటపటపటయనిపండ్లుకొరికెను బరువడిజనులదర
చటులకోపమునకన్నులనిప్పులు చటచటమనిచెదర
ఆసమయంబునబంగార్రాయం డతనిచెంతజేరి
వాసిమీరనేనేయేపాళొల్ వారిబిలుతుమీరి
నూటయెనిమిదిపాళేగాళ్లను నేటికొల్వనకును
వాటముగాబిలుపించువేగమే ధాటిమీరగాను.

(బంగారురాయడు పాళెగాండ్రకుజాబువ్రాయుట.)

అనవినిబంగార్రాయడప్పుడా హరకార్లెల్లరను
పనిచెనుబొమ్మనినూటయెనిమి పాళయమ్ములకును
నిమిషములోహర్కారులుపోయట నెరుగించగవేగ
క్రమమునజాగీవారలప్పుడు కదలిరాగబాగ
తప్పకమందుగుండుదండు తయారుతోడుతను
తెప్పునవచ్చిరయెల్ల పాళెగాండ్లప్పుడుకొల్వుకును
చేతిపట్టుయేల్గంగేరామటు చేరెనుకొల్వుకును

యాంతిరుణామలసుభంగిధొరతా నప్పుడు కొల్వుకును
తిపుతికోట మేల్ శేఖుమహమ్మదు తిరముగ కొల్వుకును
నమరివాల్‌కోటబ్దుల్ ఖాదర్ నడిచెను కొల్వుకును
ఆరణి వేంకట్రాయుండప్పుడు వచ్చెను కొల్వుకును
వారకరియలూర్ పెద్దధొరయును వచ్చెను కొల్వుకును
చెంగల్పట్టుసుబేదారుడు చేరెను కొల్వుకును
మంగళపేటజమీన్‌దారుడు మరియట కొల్వుకును
అచ్చినాయుడు బొమ్మినాయుడు వచ్చిరి కొల్వుకును
హెచ్చగనగరార్పాళెగాడును వచ్చెను కొల్వుకును
మరియును గల పాళెగాండ్రందరు మచ్చిక మీరగను
తరిమెరింగ తామప్పుడె యార్కాడ్ సరస జేరగాను
పెంపుగ ఘణఘణ ఘణఘణ యనుచును భేరి వేయగాను
సొంపుగ నబాబు పినెనా శబ్దము నింపుమీరగాను
వచ్చినవారిని గనుగొని యప్పుడు వరుసగ కొలువెల
నచ్చికంబుననులేవగ ముదమున నబాబుసాదుల్లా

{ నబాబు బంగార్నాయని సేనలనున్న రస్తులనున్న తయారుచేయుమనుట. }

ముచ్చటమీరగ బంగార్నాయని ముందుగ రప్పించి
హెచ్చుగ మందుగుండును మూడు నెలలకు నిప్పించి
తడయక రస్తుజమీన్‌దార్లకును తయారు చేయించి
వడిగల యార్నార్ ఫిరంగిలను వరుసగ నెత్తించి
ఎనభై వేల బారుతుపాకుల యిప్పుడు తెప్పించి
ఘనముగ నందుకు మందుగుండు గ్రక్కున నిప్పించి
సరగున మేనూల్ జమీన్‌దార్లకును సంగతి దెలిపించి
బరువడి రస్తును సుబేదార్లకును భర్తీ చేయించి
తిపిగ పచ్చని తెల్లనివన్నియు డేరాలెత్తించి

లావుగ సేనభై వేలసిపాయిల నీవిటురప్పించి
లెక్కలేని కాల్బలముల నెల్లను చక్కగ బిలిపించి
మక్కువయిరువై వేలేనుంగుల నిక్కడ జేర్పించి
లక్షగుఱ్ఱముల పదివేల్ వొంటెల లక్షణంబుగాను
నీక్షణంబున నుహాజరు జేయుము యింక వేగన నెను.

{బంగార్నాయడు దండునుతయారు చేసితినని
నబాబుకు చెప్పుట.}

ఆమాటలు వినిబంగార్నాయడు అడ్డియు సేయకను
సీమామూలపుబలముల నెల్లను జేర్చిశీఘ్రమ:నను
బంగార్నాయడుసలాముచేసిన బాబుకిట్టుల నెను
సంగతులన్నియు సెలవుచొప్పునను జాగ్రతైనద నెను
ఇంతమాటలు సాదుల్ ఖానుం డింపుమీరవినితా
నంతలోనజల్దీజల్దనుచును అంతిపురముజనితా
జామానీమాచొడిగినాడయా సాదుల్ ఖానుండు
సాముగపట్టుధట్టిగట్టెను సాదుల్ ఖానుండు
జరీబు టేదార్ పాగాజుట్టెను సాదుల్ ఖానుండు
జరీబనారసుపచ్చడమందెను సాదుల్ ఖానుండు
సరవిగకల్కితురాయిదాల్చెను సాదుల్ ఖానుండు
సౌరుగపట్టాకత్తినిబట్టెను సాదుల్ ఖానుండు
అప్పుడుపట్టపుయేనుగుదెమ్మనె నబాబుసాదుల్లా
తెప్పునదెచ్చెనుమాష్టీవాడును తేజముల్లసిల్ల
శృంగారంబగుయేనుగునంతట జూచిసంభ్రమమున
బంగారంబారీపైనెక్కెను రంగుచెలంగగను.
(నబాబుసేనాసమేతుడై చెంజికియుద్ధమునకుబోవుట.)
పాళెగాండ్రనుగూడిచెంజికిని పైనంబావేళ
చాలగభేరీ(వేయించుటకై సాలెరిపులుదూల

భీకరంబుగను ఢణఢణఢణమని భేరీ మ్రోగగను
ప్రాకటంబుగను ధగధగ మెరసెను పట్టాకత్తులును
కణకణకణకణకణమని తంబుర గ్రక్కున మ్రోగగను
పనివడి దబదబమని గుఱ్ఱంబులు బారుతీరగాను
సరగున ఝల్లరి తాజా తమ్మట సన్నవాద్యములును
సురుసుగ బూరుగ కాహళంబులును తోడనె చెలగగను
అరుదుగ నవాబు దండు నిలిచె పది యామడ పరువునను
గరిమతో నవాబు యేనుగునెక్కియు గ్రక్కున రాగాను
ముందుకటికముల్ [illegible]కనుచును మొనసి పొగడి నిండ
నందును వింజామరలు కుంచెలు నందివీచుచుండ
పట్టుగొడుగులు సరిగపడిగెలు దిట్టముగా రాగా
చుట్టును బేదార్లందరు వెంతో మట్టుమీరి బాగా
రాజితముగ నూగింజ వేసినను రాలదు దండునను
భూజనులందరు జేజేయనుచును పొగడుచు నడువగను
పెంపుగ తిమిరీకోట దగ్గరను భేరీ వ్రేయించి
తెంపున వచ్చి డేరా వేసి దిగిన దండుజూచి
నయముతో బంగార్నాయని జూచి నవాబు సాదుల్లా
ప్రియముతో దండు కురస్తు కట్టును పేమిష వారికెల్లా
అనినప్పుడె యా బంగార్నాయం డందరికిని వేగా
పనిబూనియు నడిపించెను రస్తు బాహాటముగాగా
అంతట కడువడి బయలు దేరె దండారణిమార్గముగా
కొంతదూరమున కేగియు డేరా కొట్టిరియటు వేగా
ఆ రాతిరి యచ్చటనుండెను దండంతట మరు నాడు
భేరీ వ్రేయుచు దేవనూరిదరి జేరి విడిసినాడు.

{నబాబు బంగారునాయనికి దేవనూరిమేటిగట్టున
దండుమునిలపవలసినక్రమము దెలుపుట.}

ఏటిగట్టువను డేరా వేసి యంతదండుడించి
పాటిగ సాదుల్ ఖానుండప్పుడు బంగార్నాయనిజూచి
పరగ దండనకు సంభారంబులు బంగార్నాయడా
పరిదురస్తు జేయించుమిప్పుడు బంగార్నాయడా
పటాళ్ళములన చటచటనిల్పుము బంగార్నాయడా
పటాణిరౌతులనొకచోనిల్పుము బంగార్నాయడా
రంగుగ గుజ్జాల్ డేరా చుట్టును బంగార్నాయడా
సంగతి దెలిసియునిలుపు భద్రముగ బంగార్నాయడా
పారాచౌకీలేరుపరచుమిక బంగార్నాయడా
భారీజండా లెత్తించుముమరి బంగార్నాయడా
సూటిగ బారుతు పాకికత్తులు షేటిరౌతులాను
వాటముగానందందునిల్పుము తేటమీరగాను
హెచ్చయినఫీరంగుల మోజాణ లెత్తించుమియిపుడు
మెచ్చువచ్చునట్లెల్ల బలంబుల మేరయజేయుమనుడు
బంగార్నాయడు పటుజాగ్రతతో పాళెపట్టులెల్ల
రంగుగనొకచో మొనలుదీరియు రయముగ శోభిల్ల
ముచ్చటతో డను మొనగాండ్రందరు ముందరగానిపుడు
అచ్చటకడు జాగ్రతతో మీరు హెచ్చరికలుగనుడు
అనుచును బంగార్నాయడు మొనలను ఆరసి నేర్పునను
కనుగొను పగరకు కడు వెరపొదవగ కావించెను త్వరను
ఇటులనబాబు పాళెంబులను యేరుపరచి యంత
పటుకున భేరీ వ్రేయించెను దంధణమని యాచెంత
భేరీశబ్దము పాతచెంజికిని సాకెకు వినగాను
క [illegible]ము బారుగ నిధరణీసింగుడు గడగడ వణుకుచును

పింతలి దేమోకలిగెనటంచును వేగమె బురుజెక్కి
అంతనబాబుదండునుజూచి చింత చేతసొక్కి.

(ధరణింగు దేసింగునకు దండువచ్చినసంగతి దెల్పుట.)

తడబడుచును దేసింగునివద్దికి కడువడిబడిరాగా
కడువేడుక దేసింగుడురంగని యడుగులపూజను నేగా
ధరణిసింగుడురంగనాథుడు తనరునాలయముకు
పరువడి నేగితదేకనిష్ఠుడై భక్తియొనర్చుటకు
పాయకనారాయణహరికేశవ పద్మపత్రనయనా
తోయజనాభజనార్దనాచ్యుతా దుష్టగర్వహరణా
మాధవదైత్యవధూగళసూత్రసు బాధితశస్త్రకరా
శ్రీధరణీధర శార్ఙ్గధనుర్ధర సేవకసౌఖ్యకరా
అనిరంగేశునిపూజయొనర్చుచు వినుతులు సేయుటకు
మనమునగుత్సించుచు దేసింగుని ఘనతను మెచ్చుటకు
ఒప్పకనిట్లెధరణీసింగుడు యిప్పుడుసుకుమారా
దెప్పర మొదవెను దేవపూజలు తీర్పగ తరియేరా
ఈపూజలచే ఫలమేమిప్పుడు యెన్నగ సుకుమారా
యేపునబొదలుచుశత్రుసైన్యములు యెదిరించెకుమారా
చేరెనబాబుదండును దేవనూరి పేటవద్ద
పూరకెకన్నులుమూసుకపూజలు సలుపువారుకద్ద
చాలుచాలుబాగాయెనుపూజలు బాలుడ దేసింగు
యేలయింకయీ దేవునిపూజలు చాలుర దేసింగు
పిట్టపిడుగుబడ్డట్టులదండిదె చుట్టెర దేసింగు
కట్టిపెట్టుమీ దేవపూజలు ఘనమతి దేసింగు
తలక్రిందిగుండాయెనబాబు తనయా దేసింగు
యెలమితోడమనమేమరియుండుట వలవదు దేసింగు
అనియిటుపల్కినతనపినతండ్రి వచనములను వినెను

కనులువిచ్చియాధరణీసింగును గనుగొనియిట్లనెను
పెంపుదూలిభీతిల్లగ నేటికి పిన్నయమీకిపుడు
యింపుగ దేవరపూజకువిఘ్నం బివ్వసేయకిపుడు
ఈయెడనొకక్షణమిచ్చటపూజ సేయవలయునేను
పాయకదండును భేదించెదను పదరకపొమ్మనెను
పిరికితురకలనుజూచిమీరలిటు బెదరుజెందవలెనా
సరికెదనిపుడాతురకలనందర నాకుజెప్పవలెనా
సంగతిదెలియకయిటుబెదరుటలు సాహసములుగావు
కొంగలగుంపులజూచిబెదరునా కొదమసింగమరుదు
చింతనొందగాదగదిప్పుడుమీ రెంతధైర్యమనను
సంతోషంబునుజెందుడీయనగ సంతసమలరగను
సంగతిదెలిసియూరకుండెను సరగధరణిసింగు
మంగళకరముగుననిపూజించెను రంగనిదేసింగు.

{సుభంగిధొరనబాబును దేవనూరిపేటను
కొల్లయివ్వమనుట.}

నబాబుదండులోతిరుణామలమేల్ సుభంగిధొరగారు
నబాబుతోడనుయిట్లనిపలికెను సుభంగిధొరగారు
ఇచ్చటదండుకుకొల్ల దేవనూ రిప్పించగవలెను
హెచ్చుగసేనకుసంతోషంబును మేరుపరచవలెను
అనిననుసాదుల్ఖానుండుత్తర మప్పుడివ్వగాను
మిన్నుచెదరగా భేరివేయుచు మేటవీరులాను
సొంపుగసుభంగిధొరనటుగూడి తెంపుతోడలేచి
గుంపులుగూడిదేవనూరిలో కొల్లపెట్టదలచి
కొంతసొమ్ములుకొంతవస్త్రములు కొల్లపెట్టిరపుడు
కొంతరొక్కముల్కొంతరత్నములు కొల్లపెట్టిరపుడు
కొంతధనములునుకొంతధాన్యములు కొల్లపెట్టిరపుడు

కొంతపశువులునుకొంతపేయలును కొల్లపెట్టిరపుడు
చూరబడిస్త్రీలనుచెరలుబెట్టెను సుభంగిధోరయపుడు
చూరవెరిగయుమరివీరులదరిమెను సుభంగిధోరయపుడు
సరగునపురిలో కాపులందరును పరువులెత్తిరంత
బరువడిగా దేసింగునిగనుగొని మొరబెట్టిరికొంత.

(కాపులు దేసింగునిగాంచి మొరబెట్టుట.)

రాంరాంరాంరాంరాంరాంరాంరాం రాజా దేసింగు
రాంరాంమనవినివినగదవయ్యా రాజా దేసింగు
దేవావినుమదెనబాబుదంను దేవనూరిలోన
యావత్తునుదగకొల్లబెట్టిరిక యరయుకునికిదగునా
కొంకకధనరాసులురత్నములు కొల్లబెట్టినారు
శంకలేకభూషణవస్త్రాదుల సంగ్రహించినారు
పట్టిరిస్త్రీలనుపురుషులనెల్లర పెట్టిరి చెరలోన
యిట్టటుకదలకకొందరుపట్టుక కట్టివేయగాను
యేమనిజెప్పుదుమయ్యా మేము యిప్పుడు దేసింగు
నేమముపూజలుసల్పనుసమయం బిపుడే దేసింగు
కన్నులుమూసుకపూజలుసేయను కాలముగాదయ్యా
యెన్నగపూజలురాజ్యముకలిగితె యెన్నోకలదయ్యా
ఇంతబిఘుకుబ్రతికిపుడవమానం బెంతపడితివయ్యా
యింతవచ్చుటలుతెలియకపోయెను యేమిసేతువయ్యా.

(దేసింగు కాపులనాదరించుట.)

అన్ననుకన్నులుదెరచికాపులను మన్ననతోజూచి
తిన్నగబల్కెనువారలతోడను దేసింగుడుమించి
కాపులారమీరలుయీచెంజిలో కదలకుండుడోలి
యేపుమీరరంగనిపూజనునేనిపుడుజేసికదలి
వచ్చియుండెడినబాబుదంను యెచ్చటపోనియను

విచ్చలవిడి నేవారలద్రుంచెద హెచ్చుశౌర్యమునను
ఒక్కదేవనూర్ కొల్లబెట్టివారి కుడతురకలను
చక్కగనబాబురాజ్యముకొల్ల సరగునమీకొసఁ
ఇప్పించెదమీకేలభయపడగ నిపుడుకాపులారా
వొప్పించెదమీసొమ్ములనేను పొందుకాపులారా

(దేసింగునివద్దికి ధనసింగువచ్చుట.)

అనియటుకాపులసమ్మతిపరచి యంతపూజసేయ
ఘనుడగుదేసింగునిదాయాదగు ధనసింగుడుడాయ
వచ్చిచూచి దేసింగునితోడను వదలకనిట్లనియెన్
హెచ్చుపూజలుచేయుటేమిటికయ్యా యింకనన్నవినియెన్
కొల్లబెట్టియాదేవనూరిలో కొల్లగాకయిపుడు
మళ్లివచ్చిమనకోటకెక్కను మరియుదండునేడు
రంగనాయకుని సేవలంబులో రంతులుజేయుచుండు
పొంగుచుతురకలుకోటనుచుట్టడి పొసగవేసెదండు
కన్నులుమూసుకయూరకయుండుట ఘనులకుదగవగున
పన్నుగాననీవిప్పుడుకద్దనము పన్నివారిసేన
బడలువడంగనుబారిసమరియాట బలుకీర్తిగనుము
జమునిపోలికనుయిట్లుండుటను కడుదీనతవినుము
అనియిటుధనసింగుడుతాబల్కగ వనమునగోపించి
ఘనుడగుదేసింగుడురంగేశుని కడువడిబూజించి
కన్నులుదెరచటు ధనసింగునితో కనలుచునిట్లనెను
యిన్నిచేసినసబాబుదండును యికవిడువను నేను
పొందుగతురకలుగుళ్లోజొచ్చిన పూజలింకసేల
అందునబాబునునరికిపూజసేనిందుజేతుచాల
అనుచువిచిత్రపుశౌలకువచ్చెను అప్పుడుదేసింగు
పనివడికాలికిపరాయిదోడిగెను బాలుడుదేసింగు

నిలువంగీలు దొడిగినాడయా దేర్పున దేసింగు
జలతరు పట్టుధట్టీ గట్టెను జల్దిగ దేసింగు
సరిగబుటేదార్ పాగా జుట్టెను చక్కగ దేసింగు
పరువడి బురుసా శాలువ గప్పెను బాలుడు దేసింగు
కలికితురాయి నికట్టెను నెత్తిని గ్రక్కున దేసింగు
చిల్కతాళి హారమ్ములు వేసెను శీఘ్రము దేసింగు
పదివేల్ తులముల యెత్తు కత్తిచే పట్టెను దేసింగు
యిదిగాకే ద్వేల్ తులముల బాలా మెత్తెను దేసింగు
మూడుమణుంగుల పేష్కబ్జాను ముదమున దేసింగు
గాఢంబుగ ధట్టీలో జెక్కెను కదలక దేసింగు
సింగము వలెగూర్చుండెనప్పుడు సిపాయి దేసింగు
పొంగుచు యుద్ధము గలిగెనేడను చెలంగుచు దేసింగు
సంగతి హరకార్లను తా జూచి చయ్యన నిట్లనెను
రంగుమీర సరదారులనెల్లను రమ్మను కొల్వుకును
పినతండ్రైన ధరణిసింగుని బిరబిర కొల్వుకును
పనివడి రత్నసింగుని యుటగోపాలసింగతోను
రాముసింగు నాలక్ష్మణసింగును రయమున కొల్వుకును
రాముదారని లక్ష్మణదారిని రమ్మను కొల్వుకును
మానిసింగును గిరిపుసింగును మురిమురి కొల్వుకును
సేన జేర్చుకొని రమ్మనుడిప్పుడు శీఘ్రము మీరగను
అనగా హర్కార్లామెయినందర నప్పుడు బిల్వగను
పనిబూనియు వారందరు సేనలు మునుగొనివచ్చియును
రాం రాం జయ సీతా రాం రాం రాజా దేసింగు
రాం రాం యనగను బదులుకు రామనె రాజా దేసింగు
జమేదారులను కన్నుల జూచెను జల్దిగ దేసింగు
తమాష చేతను పకపక నగియెను తడయక దేసింగు

మనవివినుమయాయని దేసింగుడు పినతండ్రినిజూచి
వినయముతోడుతనిట్లనెనప్పుడు వేడ్కచేయిసాచి
మొనభై వేలగుఱ్ఱాలున్నది యిచటనబాబుకును
ఆనయములక్షసియిలుగలరు గనుకనబాబుకును
మున్నూరేగుఱ్ఱములున్నదిమనకు పిన్నతండ్రియికను
మన్ననగల్గుసిపాయీలేనూరే మందిగలరుమనకు
చాలుచాలు యీనబాబుగెల్వను చాలుతండ్రిగారు
యేలయింకనీసేనతోగెల్చెద చాలతండ్రిగారు
మలకనూరిలోవున్నాడయ్యా మహామత్ ఖానుండు
పిలుపింపుము నిమిషములోపలను పిన్నయ్యానేడు
మరిజల్దిగపంపుము మూడామడ మలకనూరు యిటకు
త్వరలోబంపుమటన్నను జూచి ధరణిసింగుడటకు

{ దేసింగు తనయిష్టసఖుండగు మహామత్ఖానుని బిలిపించుట. }

అంతటహర్కారులచేతగుజా బప్పుడుబంపగాను
గంతుతో మలకానూరిలో మహామత్ ఖానునిజూడగను
మంగళకరముగ పందిటిలోపల మహామత్ ఖానుండు
శృంగారంబుగ పెండ్లిపీటపై సొంగసుగనున్నాడు
నాగస్వరములుమృదంగంబులును సంతఝల్లరులును
బాగుగభేరీనవబత్తులును పరగమ్రోగగాను
చేతనుకంకణమప్పుడుకట్టుక చెలువుమీరగాను
చేతులమంగళసూత్రము నెత్తి చెలగికట్టగాను
అల్లాకేయల్లాకేయనుచు నప్పుడుకట్టువేళ
ముల్లాశాస్త్రపద్ధతగాను మొనసికట్టువేళ
గోవిందాగోవిందాయనుచు కోరకట్టువేళ

ఆవేళలో శూరకాయులప్పుడు నతనిజూచిచాల
ప్రేమలరగ హితుడగు దేసింగుడు పిలువబంపినాడు
యేమిమివ్రాసినాడోయీజాబున నింపుతోడజూడు
జల్దిజల్దిమహామత్ ఖానుడ జల్దిలేచిరమ్ము
జల్దిగరమ్మనె దేసింగుడునిక జల్దిగాను లెమ్ము
అప్పుడుమహామత్ ఖానుడు జాబును విప్పిచూచినాడు
తప్పకమంగళసూత్రముతట్టలో తాను బెట్టినాడు
ప్రాకటంబుగనుమహామత్ ఖానుడు పకపకనవ్వుచును
తేకువమీరగ చెంజికిపోవలె తెప్పననీయెడను
నాకతిమిత్రుడు దేసింగుడు తానలమటజెందుటకు
యీకంకణము పెడ్లిండికి కాదు యెన్నకదనమునకు
యుద్ధమునందుశత్రులగెలిచి యూరటనొందియును
శుద్ధంబౌకీర్తిని నేపొందియు సూటిగపెండ్లికను
చేసికొందుననిమహామత్ ఖానుడు చెలగమోహరించి
వాసిగతనబంధువులనెల్లను వడిగనపుడజూచి

మహామత్ ఖానుడు చెంజికిపోవుటకు
బంధుజనులను సెలవొసంగుడనివేడుగుట.

తగినకొలందిసలాములుచేసి తడయకనందరికి
తగవుమీరగా తనమాటలువిన తనివిపుట్టియునికి
తెలిసివారలకుమహామత్ ఖానుడు ధీరతతోడ తనను
భళిరేమీరలుసంతోషముతో బంపవలయునన్న
అన్నలారవోతమ్ములారమీ రరసిపెద్దలారా
పన్నుగమీరిచ్చుటనుండండో పఠాణిదొరలారా
నేనొకమనవిని చేసెదవినుడిది నిమ్మళంబుగాను
పూనినబాబుతో యుద్ధముచేయగ పోయిటవచ్చెదను

పగవాడైనబాబుచెంజికిని బలములతో రాగా
తగదికనిక్కడనుండుట నాకును ధర్మముచెడిపోగా
యెదిరియైననబాబుదండులో యిపుడు నేనుజొచ్చి
తుదమొదలిదియనితోచనీయక దునిమెదనెదమెచ్చి
అచ్ఛాబహదర్ మెచ్చితినిన్ను తుచ్ఛసైన్యములను
కచ్ఛరూపుడుకడలిగలంచిన కరణినియిప్పుడును
కలచితివౌరాయనిమీరనగను కడువడిశూరతను
యిలగలవారలునెల్లరుమెచ్చగ నిటులసేయగాను
మహిలోనెవ్వరుచాలరంచుమీ రందరుననగాను
విహితంబుగనేబోయివచ్చెదను వేడ్కలుప్పతిలను
అనియిటుమహమ్మత్ఖానుడు వెడలగ నావృత్తాంతమును
వానితల్లివినివడిగావచ్చెను వలవదుడుగుమనను.

(మహమ్మత్ఖానునితల్లి పోవలదని ప్రలాపించుట.)

యెదురుగవచ్చికుమారునిముద్దిడి యేరాసుకుమారా
యిదియుద్ధమునకుతరియగునే యీప్రొద్దునిల్వగదరా
పదిమాసంబులు మోచికనిననను బాలుడవిడువకురా
అదిమొదలుగనిన్ బెంచితినన్నడలగవిడువకురా
బుద్ధిమంతుడనినామదిలోను పొంగుచుంటిగదరా
యుద్ధముసేయగబొమ్మననామన మొప్పదుసుకుమారా
గంధముబూసుకయుద్ధముజేసిన కత్తినరుకతగులు
సుందరమగుకంకణముతోబోయిన సూటిగుండుతగులు
పసుపువస్త్రములననికనినిపినవు పరగగుండుతగులు
పసివాడవునీకేలనబాబుతో పరమవిరోధములు
పెద్దలమాటలువినినీవిప్పుడు పెండ్లికొరగతదీర్చి
సిద్ధంబుగనీబంధులతోడను జేరిపించవొనర్చి

బహుమతులను బహుమతులగు బంధుల బలుమన్నన జేసి
సహజంబుగ వారలదమయూళ్లకు సరగనను పజేసి
ఈదినమిచ్చటనుండి యునీవును యిరవుగాను రేపు
క్రోధముతో డనబాబుదండును కూల్చిరూపుమాపు.

(మహమత్ఖానుడు తల్లినిసమాధానముచేసుట.)

ఆమాటలువిని మహమత్ ఖానుండనెనుతల్లితోను
యేమమ్మానీవిటులపల్కెదవు యిపుడు చెంజిలోను
నన్నేలినదేసింగురాజనెను నాకు జాబు నేడు
సిన్నన బాబుదండునుగూడుక నెదిరించినాడు
ఈవేళకు నాచెంజిదుర్గము యేమాయెనో కాని
సావకాశముచేయగూడదిక చయ్యాన నేపూని
రెండుగడియలకులోనన బాబు దండునరికి వేసి
ఖండితముగ నార్కాడుకోటను కాల్చిపాడు చేసి
చెంజిరాజుకుపట్టముగట్టెద శీఘ్రముగా నేను
రంజితముగ సాదుల్ ఖాన్ కూతురి రయముగ నేలెదను
దండునగుండు తగిలిసిల్లినను నిందుపదవికద్దు
మెండుగ ముందరిపోటునబడితే దండిపదవికద్దు
సారుగభువిలో పుట్టినయపుడే చావునిశ్చయమ్మా
పోరిజయించిన శాశ్వతకీర్తిని పొసగగందునమ్మా
కినిసిదండులోపోరి తెగినను కీర్తి గలుగునమ్మా
వెనకడుగులు బెట్టుదు రేశూరులు వింతలుకాదమ్మా
అనియీవిధమున తల్లికిసమ్మతి గనబడబల్కియును
చనిమెదనిప్పకు చెంజికిజననీ చాలదీవెనలును
ఒసగుమటంచును మహమత్ ఖానుం డొప్పుగనప్పుడును
పసగలసొమ్ములుపట్టువస్త్రములు కరువడిదొడుగుచును

{ మహామత్ ఖానుండు నీలవేణియనుగుఱ్ఱము నెక్కి చెంజికిబోవుట. }

మరిమరితల్లికిసలాముచేసి మహామత్ ఖానూడు
త్వరలోగుఱ్ఱపులాయంబునకును తానువచ్చినాడు
మూన్నూర్ గుఱ్ఱంబులలోపలను ముఖ్యంబాదవగను
ఏన్నెకెక్కు వగునీలవేణియను నాగుఱ్ఱమునటను
గట్టిగకట్టినయాగాడిపిచాడిని ఖడ్గంబుననరికి
దిట్టముగనుపురజనులనుగనుగొని దీవెనలిమ్మనిపలికి
జల్దీయనుచునునీలవేణికిని జాగ్రతదెల్పుచును
జల్దిగనబాబుదండులోజొరబడి జయమునొందవలెను
పొందుగజనుమఃనీలవేణికిని పోషాకిచ్చియును
ముందుగనడువుమునీలవేణియని సందేహించకను
అల్లారేయల్లారేయనుచును అటథవుడాయించెన్
యెల్లవారుఙూడంగను చెంజికి నల్లననేతెంచెన్.

{ మహామత్ ఖానుడు వచ్చుచుండగా నబాబు సేననుపంపి యడ్డగించుట. }

ఆసమయంబుననబాబుసేనలు నతనిజూచివేగ
మోసముయెవడోవొంటిగుఱ్ఱమును వేసుకవచ్చెనుబాగ
శూరుండితడనితోచుచున్నయది జూడగానుయిపుడు
స్వారస్యముగాదికనిట్లుండుట సరగునరండనియపుడు
కొందలమందుచువారలుమున్నూర్ గుఱ్ఱములను దెచ్చి
సందులేకనడ్డముగానిల్చిన చయ్యనకోపించి
గిరగిరమనుచునునీలవేణితో గినిశితిరిగితిరిగి
పరువడిమారిమెసంగినరీతిని బల్మిబట్టిపెనగి
చురుకుచూపులను సేనలజూచి యొరనుకత్తిబెరికి
కరుకుకరుక్కనిహయములనెల్లను గజిబిజిగానరికి

పన్నగదీముగగగక్షుములెల్లను భయమునొందెనటను
వున్నసిపాయీల్ కన్నులపడకను క్రన్ననపారిరియటను

(మహామత్ ఖానుండు దేసింగును జూచుట.)

మహామత్ ఖానుడు చెంజిలో రాజా మహాలు కేగిలోన
సహజంబుగ దేసింగునిజూచి సలాంసలామనిన
బదులుసలాము చేసెనప్పుడు బాలుడు దేసింగు
అదిగనిమహామత్ ఖానుడుమదిలో నంతటనుప్పొంగు
కొనుచునబాబుసంగతినిన్నటి దినముదెలిపితేను
మొనలసభాసుజేసిదండును మొత్తిపడుతు నేను
ఇత్తరియుత్తరవై తేనరికెద తుత్తుమురులుగాను
సత్తలేనికార్యంబిదియెంతటి దిత్తరిచూడగను
అనియిటుపల్కినమహామత్ ఖానుని మనసెరింగి తెగువ
తనరగపెండిలిపీటవిడిచిమొన దాకవచ్చుటకువగవ
ఆమాటలుయింకేమియిప్పుడు అన్నా దేసింగు
నామాటలువినునబాబునిప్పుడు నణచివానిసొంగు
దండుహల్లకల్లోలంబుగను తాజేయుటగాక
చెందుచునార్కాడెల్లనుపాడు చేసినయటువెనుక
చెలగినబాబుకోమాతేనుపెండ్లి చేసుకొనెదబాడు
చెలువుతోమీరుపెండ్లికిరావలె సిద్ధముగానపుడు
అనదేసింగుడుమహామత్ ఖానుతో నప్పుడిట్టులనెను
చనిమనమిద్దరునబాబునిప్పుడు చంపగవలెనికను
సావకాశమును చేయగూడదిక సంగతిజెప్పెదన
దేవుడైనరంగేశునుత్తరవు దీసుకరావలెను
నగరుకేగినారాణినిజూచి తగవుబలికినేను
పగవాడైననబాబునుమనము పరగగెలువకను.

{ దేసింగు పినతండ్రితోడ తనభార్యను చూడవలెనని యడుగుట. }

నగరికిఁబోవుచుపినతండ్రితో తా ననియెనుయిట్లనుచు
పగనబాబుతోఁగలిగెనుగావున తగవును నేఁగనుచు
పోవలెయుద్ధంబునకటుగావున పొందుగ నాకిపుడు
యీవలెను త్తరమిప్పుడు తడయక యీవలయును నేను
పోయిరాణినిపొడగని నేను పోయెదదండుకును
యీ యెడ నాలస్యముచేయఁగ రాదెన్నఁగ మనమునను
ఆమాటలువినిధరణీసింగుం డపుడువ్యసనమునను
యేమిర నాయననీవిటుపల్కిన నేమి సేతు నేను
తనయా నీవునుశుక్రవారమున తగజనియించినది
ఘనముగ రాణియుశుక్రవారమున తనరగబుట్టినది
నీదుగుఱ్ఱమునుశుక్రవారమున నేర్పుగవచ్చినది
యీదండమునునాశుక్రవారమున నెలమినివచ్చినది
వరుసగనీకునురాణికిహయముకు వచ్చిన సేనకును
పరికింపంగనుజన్మవారములు వొకటిగనుండుటను
సరవినిశుక్రునివారంబెన్నఁగ సామిగవినునేడు
సరిగాదరుగుటకదనంబునకును చక్కఁగానుజూడు
నేడంతయునోర్చుక రేపరుగుము నేర్పుమీరగాను
కొండానెక్కకుజనులుబెదరఁగ కొడుకానీవనను
సన్నుతినొందక దేసింగుడుబల్ సాహసంబుతోను
ముష్కరమగుశూరత్వముతోడను మొనలగలపగాను
తలచినవ్వికినితరిమెరుంగక తారుమారుగాను
పలికెనుధీసింగుడటంచును కలకనొందగాను.

(ధరణిసింగు దేసింగునకు భార్యను చూడకూడదనుట.)

తెలిసియప్పుడా ధరణీసింగుడు దేసింగుని గాంచి
పలుకరించెద నొకరహస్యము బాగుగ నూహించి
అదివినుమేమన నొకటియున్నది యే జెప్పెదనయా
సదయులయిన పెద్దల శాస్త్రంబులు చక్కగ వినుమయ్యా
భరణిపుబ్బ యాశ్లేషయు మొదలగు దురితపుఁ జుక్కలను
విరిబోడులు ఋతుమతులయినను కోరవేనని యందరును
చెప్పుచునుందురు గావున నీసతి చేటుగల్గు దినము
దెప్పరమగు నీభరణీ తారను తెలియగాను వినుము
మొదటిపాదమున మొదటరజస్వల ముచ్చటగా నయ్యెన్
అదికారణమీవిక నాల్నెలలు నతివ జూడరాదయ్యెన్
నామాటలు వినికొరత దినంబుల నయముగాను గడను
నీమదిదోచిన కార్యము సేవు నెరవుము మది వెరను
పుట్టుచున్నది నాదుకు మారక పొసగ వినుము మాట
పట్టపురాణిని చూచు తలంపును మానుము యిచ్చోట
అన నామాటను విని దేసింగుడు నతికోపముతోను
తన పినతండ్రిఁ జూచి యిట్లనెను నయముగ నంతటను
కామాతురుడను నేమవర్జితుడు ఘనదురవస్థలను
సోమసూర్యులున్నంత కాలమును చొక్క నరకమునను
నీమాటలనటులుండగనిమ్ము నిజముగాను తండ్రీ
నేమముదప్పను కదనంబునకును నేనుబోదు తండ్రీ
ముందుబెట్టినయడుగును నేను మొనసి వెనకనిడను
యిందుకు యోచన వేరేలేదు సందేహించకను
నాకొసంగుము సెలవు వేగమే న్యాయముగా తండ్రీ
యీకార్యముకై యిపుడభ్యంతర మెనయనీక తండ్రీ

ఈరీతిగ పలికిన యాతనయుని యేపుమీరగాంచి
తీరుగనీకును రాణికిని దుమను తెరమరుగ కట్టించి

(దేసింగుండంతఃపురమున కరుగుట.)

మాటలాడవచ్చురతనయాయన మదిసంతసమునను
తేటగ రాణినగరుకువచ్చెను దేసింగుండటను
వచ్చిన కార్యముహూర్కారులతో వదలక చెప్పినను
అచ్చటయంతఃపుర వాసులతో నమరగ దెల్పగను
దాదులుపోయి రాణితో బల్కిరి తడయక నప్పుడును
వో దేవీనీ ప్రాణనాథుడిదె వొప్పుగ వచ్చెనుకనను
రమ్మనుమని సెలవిచ్చెను వేగమె లెమ్ము రాణియనను
సమ్మతించి సంతసమున లేచి కమ్మనిజలమునను
స్నానము చేసిచలువదుకూలము చక్కగ సవరించి
మానుగ పట్టుజిగిబిలిర వికైయు మమతతో ధరియించి
పన్నీర త్తరు గూర్చినకలపము బాగుగ నునలది
కన్నుల కాటుక ముఖమునతిలకము తిన్నగా నుదిద్ది
కరకంకణములు కాళ్లగజ్జెలును కంఠసరంబులును
సరిపెణలును మెడనూలు రాగడియు జడనుకుచ్చులును
బొంగడలుకమ్మలు జుమికీల్ బేసరి బులాకునత్తులును
నిగనిగ మెరసెడి వొడ్డాణంబును సొగసు మెట్టియలును
మొదలగునాభరణంబులన్నియును ముదముమీరదొడిగి
పదపడిసొంపులు గుల్కెడిసొగసున పరిధవిల్లి కడగి
పోసగమల్లెలు మొల్లలు కొప్పున పొందుగా నుముడిచి
ముసిముసినగవులతో డసఖ్యులగు ముదితలతో వచ్చి
తెరచాటున ఘల్ ఘల్లనినిలచిన దేసింగుండటను
పరసతిగూరిచివాసిగ నిట్లనె పరమద్భుతంబుగను
మరువక వినునా ప్రాణనాయకి పౌరుషపషమును

సరసత లేకన బాబు సేనలను చయ్యన గూర్చియును
దండు చెంజిపై దెచ్చి యిప్పుడు దలపడియుండగను
ఖండితముగ సేన బాబుతోడను కయ్యము చేయగను
తెంపున బోవలె నిన్ను జూచుటకు సొంపుతోడ నేను
యింపుగ వచ్చితినిక క్షణమేనియు నిల్వగూడదిటను.

**రాణి దేసింగుని యుద్ధమునకు బోవద్దని సంవాదము సేయుట.**

అన దేసింగునితోడ రాణి తానప్పుడు గ్రక్కునను
ఘనమగు వ్యసనముతోడ బల్కెను తనమది బాగలగను
సబాబుతోడను యుద్ధము వలవదు నాదు ప్రాణనాథ
జబాబు సరిలేదని కోపించకు స్వామి మనవి బాధ
కలుగునటంచును తెలిసి చెప్పితిని యలసటనొందకను
వెలయు మనమునందంబున నేను చెప్పితిని విస్తరంబుగాను
ఆదరింపగావలె నా పలుకులు భేదము దలపకను
ఆదిదేవుడౌ రంగని ధ్యానం బరపి చేయుమికను
కోటకు వెలపట యుద్ధము చేయగ వాటము గాదిపుడు
సాటిగాదు తురకలతో యుద్ధము స్వామి మనవియిపుడు
జగడాలను మనకిప్పుడు లేవిది ప్రియనాథా వినుము
నయమును మీరగ సంధిక్రియలను ప్రియమానవా నరుడవు
ఇటువలె జెప్పిన రాణిని గనుగొని యిట్లనియెను నృపుడు
పటుతరమగు దండెల్ల కోటపై పనివడి రానిపుడు
కృపణత నూరక నేనుండినన కృపణుడనై యిలను
అపకీర్తియు లోకాపవాదములు నరయగ నాకగును
అన దేసింగునితోడ రాణి తానప్పుడిట్టుల నెను
మనమున గుందుచు పరితాపంబున తహతహనొందుచును
స్వామి మీరు నన్నుగని సాక్షిగా చయ్యన చేపట్టి

ప్రేమనుసుఖములననుభవించకను పేనుకువతెలపెట్టి
తెగువకుజోరగా తగవగునామీ మగటిమిజూపగను
తగుతరియిదిగాదనితో చెడునా దగుమనమందునను
ఇటుజెప్పినతన రాణితోడదేసింగుండిట్లనెను
పటుతరముగనేదండునజోరబడి పరులజయించినను
తటుకునవచ్చినిన్నెలెదనేతప్పకయిప్పుడును
చటులధైర్యమునశత్రులద్రుంచెద సత్యంబుగనేను
రాకదండులోనీల్గినస్వర్గము ప్రాకటముగగలదు
చేకొనిజయమును చెందివచ్చినను చిరకీర్తియుగలదు
అనదేసింగునితోడరాణితా నప్పుడిట్టులనెను
ఘనవిక్రమమునదండుజొచ్చి గ్రక్కున మీరలును
ముందునరుకుననుపుడమినిబడినను ముఖ్యంబుగనేను
సందేహములేకను జేసెదను సహగమనముతగను
వెన్నుపోటుచేధరగూలినమిము కన్నులతోగనను
పన్నుగానునేకట్టిడ్పింతును పాతచెంబిలోను
అనిచెప్పినయారాణితో దేసింగపుడుయిట్టులనెను
ఘనతరముగనీవాక్యమునాకును కడుముదమొదవగను
ప్రీతిమొనర్చెనుసొంపుగనైను పిరితివియకనేను
ఖ్యాతిగయుద్ధముచేసిబిరుదులతో కడువడివచ్చెదను
నాదుపరాక్రమమునకునుదగినది నీదగుధైర్యమును
నీదుపలుకులకుసంతసించితిని నేనికపోయెదను
అనగా రాణియునతిహర్షముతో నపుడుచెలులబిల్చి
ఘనతరవస్తువులంబుగవీడెము మనమలరగదెప్పించి
అరిసిశత్రుజయింపగ తాంబూలంబునిచ్చుచపుడు
ఒగ్గనాతనిచెయిశృంగారము తెరగుచూచినపుడు
పాటవమునసేనలనెల్లనుతా బడలుపరచునంచు

మేటివిలాసముతో డశత్రులను మృత్యువునొందించు
అనిసాముద్రికశాస్త్రము దెలిసిన ఘనమతిగావునను
తనమదినిశ్చయమాచరించెను తరుణీమణితాను
నాథునిశృంగారముజూచుటకును నాకుప్రాప్తిలేదు
నాథునికూటమిలేదనిబ్రహ్మ నాకువ్రాసెముందు
కన్నులనీరునించుచుతనప్రియ కాంతునిచెయ్యటను
కన్నులనొత్తుచు నేడ్వఁగ చెయితాఁగక్కున వెనకకును
తీసుకొనియును తెప్పన నాతడు తెలివినివిలసిలుచు
వాసిఁగ గుఱ్ఱము నెక్కుటకప్పుడు పరువడితో జనుచు.
(దేసింగుచోపుదారినిగుఱ్ఱమునుశృంగారించితెమ్మనుట.)
పదపడిగుఱ్ఱపులాయంబునకును పటుఁగతినరిగియును
అదలించియుచోప్దారినిబారాహజారిదెమ్మనెను
అప్పుడుబారాహజారినటచోప్ దారితేఁగజూచి
తప్పకశృంగారించకతెమ్మని యప్పుడుసెలవిచ్చి
రంగులకళ్లెముఁబంగార్ జీనియు రంజితంబుగాను
శృంగారంబగురికాపులనుబల్ సొంపుతో వెలయఁగను
చిల్కతురాయిశిరమునందును చెలువుమీరబెట్టి
తళ్కులబంఁగరుబిళ్లలదండలు దనరమెడనుఁగట్టి
పట్టుకుత్తినీపచ్చడంబుబల్ పైకప్పునుఁగప్పి
దిట్టనుబారాహజారిచోప్దార్ దెచ్చెమనవిజెప్పి
నంతటదేసింగుడుతనబారాహజారినటుజూచి
సంతోషంబునసుబేదార్లను సరగఁగజూచిలేచి
బారహజారిదగ్గరకొచ్చి పయినచెయ్యివేసి
మేరాబారాహజారిసెను యీనబాబుగెలిచి
వచ్చినరత్నాల్ భూషణములనీ కిచ్చెదవేడుకను
హెచ్చుధైర్యమునదండులోనీవు జొచ్చితిరుఁగవలెన

(బారాహజారి వ్యసనము జెందుట.)

అన్నను బారాహజారి కంతట నతివ్యసనముదయించి
కన్నుల నీరటు కారుచుండ తన కాలు దిగువరాఁచి
ధైర్యము విడిచియు తోకనెత్తికొని తలనేలకు వంచి
శౌర్యము దూపి నోటను రుగురా చప్పళ్లను వైచి
ఉన్న గుఱ్ఱమును దేసింగుఁడుగని కన్నెఱ్ఱజేసి
యెన్నఁడు నిట్టుల నుండవు బారాహజారి నినుఁడాసి
కాపాడితినను మోసము జేయుట గలదె సమయమందు
సొంపుగ నే తకు పదివేల్ వరహాల్ చని మెఖర్చులందు
పెంపుగ పుల్లలు వలదని సెనగలు పెట్టిస్తి నే నీకు
తెంపుతో లేతకసువ మోపులను తెప్పిస్తి నే నీకు
నీళ్లకు బదులుగ సారాయి దెచ్చియు నీకును పోయిస్తి
వాళ్లికి మెత్తగ దూది మెత్తలు వానరగ పరిపిస్తి
కళ్లెము మొదలుగ నవరత్నములతో ఘనపోషాకేపును
తెల్లముగా చేయిస్తి నే నీకు చెలగ మోసమిపుడు
యేల చేసెదవు తెలిపి లేకనిక నే జెప్పెద వినుము
చాలగ భువి యీ జన్మమెత్తితివి మేలు కీర్తిగనుము
ఆరులో చావు నూరులో చావు అది నిశ్చయము గను
ధీరత యుద్ధములోన జచ్చినను చేరుదు స్వర్గమునను
పుట్టినప్పుడే చావు నిశ్చయము పుడమి నందరికిని
గట్టిగ యిది నీ మనసున నిల్పుము కడు ధైర్యము పూని
అనవిని బారాహజారి యంతట నతిధైర్యముతోను
ఘనమగు దేహము ఝుళిపించంతట గర్జన జేయుచును
ఉన్న గుఱ్ఱమును దేసింగుఁడు తానొప్పగాను మెచ్చి
సన్నుతుడగు నారంగనాయకుని సన్నిధి మాటఁజొచ్చి

{ దేసింగు రంగనాథుని వద్దికిబోయి యుద్ధముసేయుటకు సెలవడుగుట. }

తిరుమంజనస్నానపుష్పములు దివ్యవస్త్రములును
వరమణియుతభూషణములు గంధముపానసద్రవ్యమును
పరిపరివిధములనై వేద్యంబులు బహుదీపాదులును
రంగనాథునిసన్నిధిజేర్చి రంజితంబుగాను
బంగరుపువ్వులబూజించియును భక్తియుక్తముగను
రంగనాయకులకెదుటనిలువబడి పొంగుమనముతోను
రంగుమీరగాదేసింగుడుశ్రీ రంగనిధ్యానించి
శృంగారంబుగపూజలుజేయుచు చెలగినివేదించి
వాసిగనాదేవునికినిమ్రొక్కియు పరమభక్తితోను
యీసమయంబునగాపాడగదే శ్రీశప్రేమతోను
నారాయణశ్రీరంగకేశవా ఘోరకలుషహరణా
వారిజాక్షవైకుంఠనివాసా శూరదనుజమదనా
తల్లివినీవే తండ్రివినీవే దాతభర్తవునీవే
యెల్లలోకములకాధారంబగు యాదికర్తవునీవే
కాచినబ్రోచినవాచెలికాడవు బ్రోచుదైవమువును
వాచక్రశరాసివేయనిసేనల్లములోపలను
నమ్మికనున్నాడనయీతనినే నెమ్మదిలోనెంచి
కమ్మికవచ్చినబాణదండమును కడువడిఛేదించి
జయమునొసంగుముజలచరరూపక జలజపత్రనయనా
జయజయశ్రీహరిశత్రుహరిభుజంగరాజశయనా
అనివేవిధములబొగడియుతనమది నపుడుశ్రుతముగాను
ఘనమగుభక్తిని మరిమరిమ్రొక్కుచు వినయమునతోడుతను
బారహజారిపైనెక్కియును బలిమునిదేసింగు
తారవ్యముగాజననెంచియును తటుకునదేసింగు

పూనిన బాబుతో యుద్ధము సేయగ బోవుచున్నాను
మానక జయమును కలుగ జేయుము మరువగవలద నేను.
(దేసింగు రంగనాథుని యెడల దుశ్శకునములుగనుట.)
తటుకున ధారుణీగిరగిరదిరిగెను తారుమారుగాను
బటువగు దేవుని మెడలోహారం బటతెగభువిపడెను
పటపటమనిగోపురశిఖరంబులు పడెనుభూమియందు
చటులతరంబుగ రాలెనుచుక్కలు తటుకునపగలందు
చుట్టుచీకటులుకమ్మెనప్పుడు జూచువారికెల్ల
అట్టియఖండములారెను దేవుని కణగెతేజమెల్ల
గ్రక్కునస్వామియుముఖమునుపడమటిదిక్కుద్రిప్పెనటను
అక్కడ దేసింగుమరోషంబున ననెనుస్వామితోను
యేమిరరంగానీవిప్పుడునన్నిటులసేయనగునా
స్వామియనుచునినునమ్మినందుకిటు జేయనీకుతగునా
గొప్ప దేవళముప్రాకారంబులు నిప్పుడుకట్టిస్తి
తప్పకబంగరుధ్వజస్తంభము నిప్పుడుచేయిస్తి
కల్కితురాయికంఠసరంబులు కనకవైరముడులు
చిల్కతాళియుహారంబులుమంజీరకంకణములు
నిత్యపడితరముదీపారాధన నిత్యోత్సవములును
ప్రత్యేకంబుగపంచపర్వముల బ్రహ్మోత్సవములును
అరయగనీకొకతక్కువలేకను నడిపించితినేను
యిరవుగనాకుసదుత్తరమిప్పుడు నియ్యకనుండినను
ఇచ్చినపోయెదనింకమీదనీ వేమిజేసినాను
యిచ్చనుధైర్యముదొలగదునాకు నెన్నికమీరగను
అనియటనిలువకచనియెడిరాజుతో నంతరంగడనెను
వినువాపలుకులు దేసింగుడనీ విప్రముప్రియంబునను
ఘనతరబలముల గెలువగజనుము కడువడిదేసింగు

వెనకదీయకను వైరులగెలువుము వేగమె దేసింగు
ఘనముననీకునుకొదవయువలవదు బాలుడదేసింగు
పనిబూనియువొకముహూర్తమాత్రమే బాలుడదేసింగు
నీపాలిట నేనుండెదదండున నేర్పుగ దేసింగు
సాపుగనరికియుసంహారింపుడు చయ్యనదేసింగు

( దేసింగు యుద్ధమునకుజనుట. )

అనగాసంతసమున రాజంతట హజారినెక్కికొని
తనసహాయులౌసుబేదారులను తానటబిల్వమని
చెప్పిన రాంసింగ్ లక్ష్మణసింగుల తెప్పుననప్పుడును
తప్పకహీరాదాసులక్ష్మణ దాసులనంతటను
ధరణిసింగునుమానిసింగును కరుణసింగులను
నరహరిసింగునారణసింగు మురారిసింగులను
రత్నసింగుగోపాలసింగును రాజాసింగులను
అతిత్వరపేటశిపాయీమహమత్ ఖానులనప్పుడును
రమ్మనిచెప్పినదూతలుజనివా రందరువిడుదులకు
సమ్మదమునజనితెలియజెప్పగను సాలుగయుద్ధముకు
తమతమగుఱ్ఱములెక్కికత్తులు దాల్చివారలంత
అమితబలంబులజేర్చుకనప్పుడు అటనిలిచినసంత
సేనలగనుగొనిసంతసమునదేసింగుడుపొంగుచును
తానటుభేరీవేయించెనుధం ధణధణమనగాను
కరుకునదేసింగుడువచ్చుటను యెరుకసేయుకొరకు
సారెకునప్పుడుబంగార్నాయడు జేరెనబాబునకు

{ బంగారునాయుడు దేసింగువిచ్చువిధంబు నబాబుకు దెలుపుట. }

సలామయ్యావోసలామునీకు సాదుల్ ఖానుడా
బలేషూరుడై దేసింగుడుబహు బలముతోగూడా

సింగముపగిదెనే దేసింగుండును జెలగివచ్చెనిదుగో
అంగములదరఁగ బులిచొప్పన దేసింగు డెదిర్చెనుయిదుగ
మదమేనుగుపగిదె దేసింగుండును మరివచ్చెను నేడు
కదసీకృష్ణసర్పమువలెనిప్పుడు కదలివచ్చెజూడు
యిదె దేసింగునిదండువచ్చెను యేమిచేయగలము
చెదరియున్న దేమనదండెల్లను యిదిమనమునగనుము
ఇప్పుడు యోచనచేయఁగ నాకును యేమితోఁచలేదు
చెప్పెదనొక్క యుపాయంబున్నది తప్పవేరెలేదు
మట్టిచెట్టుమునిగున్నదినీళ్లను మలయనూరిచెరువు
మిట్టగతాయనూరిచెరువులో మేటినీళ్లుగలవు
చెరువులు రెండును కొట్టిశంకరాభరణమేటిలోన
బరువడివిడిచినదాటగూడదు మనుజులందులోన.

{ నబాబుబంగారునాయనికి చెరువులుతెగఁగొట్ట
వుత్తరవొసంగుట. }

అనిచెప్పినబంగారునాయని యాననంబుజూచి
ఘనమగుచెరువులు తెఁగఁగొట్టుమని కడువడిసెలవిచ్చి
నంతటబంగార్నాయుడువేగమె నన్నూటికిజనుల
కొంతజేర్చుకొని రెండుచెరువులను కొట్టిననీళ్లెల్ల
నిండిశంకరాభరణమేటిలో మెండుగపొర్లుచును
చెండుచుబుసలుగొట్టుచువచ్చెడి సర్పంబులవలెను
వడిగాకొండలపొర్లించుకొని వచ్చుచున్నవేళ
తడయకబంగార్నాయుడుదండును దనరజూచిచాల
వ్యూహముచేసిదండునెల్లను వొప్పజేయవలెను
మోహరమునకనమలుయేర్పరచి ముందునిల్పవలెను
అనుచునబాబుతో బంగార్నాయుం డపుడుచెప్పగాను
వినినబాబుయిదెయు త్వరమనుచును వేగజెప్పగాను

(బంగార్రాయడు బందోబస్తుగా వ్యూహము కట్టుట.)
మొదటికనములో సుభంగధీరను ముఖ్యంబుగ నుంచి
గతియించ బ్దుల్ ఖాదరు రెండవ కనములోన నుంచి
ఘనముగ దావుత్ ఖానుని మూడో కనమను నిల్పియును
మనమలరగ ఖాన్ సాయబు నాల్గో కనమయందు నిడెను
అరయగ గండికోట సుబేదార్ నైదో కనమకును
గురుతుగ నారవ కనమకు కలవ కోటసుబేదార్ను
యెన్నగ నారణి వేంకట్రావును యేడవ కనమకును
పన్ని యెనిమిదవ కనమకు చెంగల్ పట్టుసుబేదార్ను
దురుసుగ తిమిరీ షేకుమహమ్మదు తొమ్మిదో కనమకును
అరయగ పదియవ కనమకు సాదుల్ ఖానుని నిల్పియును
ఈరీతిగ బంగార్రాయడు యేర్పాటుగావించి
సారెకు తాను నవ్యూహము కట్టును స్వారి చేసివచ్చి
(దేసింగు తన సేనలకు దిట్టపరచుట.)
ఉన్నయచ్చటను దేసింగుడు తా నున్న సుబేదార్ల
కన్నులగను గొని యిట్లని పలికెను కదసి వారికెల్ల
ఆలుబిడ్డల బంధులమీదను ఆసగలిగియున్న
చాలగ ధనధాన్యంబుల పైనా సలుమీకిపుడున్న
పెండిండ్లకును ధైర్యశౌర్యములు పొసగ లేనివారు
రందు ప్రాణములమీద దృష్టిలేకుండ వారుమీరు
యుద్ధములో దెగపడ్డవారికి నొప్పుపడవికద్దు
యిద్ధరలో పలగెలిచిన కీర్తులు నెక్కువగాకద్దు
అని దేసింగుడు పల్కుచు బారా హజారిగదలించ
మొనసి సుబేదార్లంత గుఱ్ఱముల ముందుగ నడిపించ
వచ్చి శంకరాభరణము గట్టున వరుసగా నిలిచి
యచ్చట వచ్చెడి పినతండ్రిని తా నంతతిరిగి చూచి

(పినతండ్రిని దేసింగు వెల్లువ యెచ్చటనుండివచ్చెననుట.)

ఇంతకుముందుగ నీళ్లులేవు యీ యేటియందు ముందు
గంతులు వేయుచు వచ్చు ప్రవాహము గంటిని పుడు యిందు
అని పల్కిన దేసింగునితోడను పినతండ్రియునని యెక్
ఘనముగ బంగారాన్నా యని సేతల తనయాయిటుల య్యేక్
తాయములయనూ చెరువులు రెండును తెగ తెగ కొట్టిపుడు
పాయక శంకరాభరణ మేటిలో పరగ విడిచినాడు
తెప్పున రెండుఘడియలలోపల తీసిపోనువినుము
తప్పకనప్పుడు యీగట్టునకును దాటవచ్చు ననము
అనవిని దేసింగుడు పకపకనగి యయ్యా వినుము నేడు
మనకు నుభయపడి చెరువులు త్రెంచిన మరినిలు తున చూడు
పన్నెండంకెలు గలిగినట్టియా బారహజారియును
ఉన్నతమైన గుఱ్ఱముతోనె నొప్పుగ ధుముకుదును
అనియప్పుడు తా బారహజారిని తనరగ తట్టుచును
ఘనధైర్యంబున దేసింగుడు తా కడువడి ధుముకగను
రామసింగుడు లక్ష్మణసింగుడు రత్నసింగుడూను
రాము దారియును లక్ష్మణదారియు నంత గుఱ్ఱములను
మానిసింగుడును పేటసి పాయి మహామత్ ఖానుడును
పూని గుఱ్ఱములతోడనప్పుడు పొందుగ ధుముకగను.

(సేనలు యేటిలో దిగి ముప్పదిగుఱ్ఱములతో యావలిదరి జేరుట.)

గుబగుబగుబగుబగుబగుబయించును గుఱ్ఱంబులు ధుముక
తడబడ నీదుచు నీరును నోట తీసి యుమియుచును బాగ
రెండు ఘడియలదూరమున్నయీ నిండు యేటియందు
కొండలు డొల్లినయట్టుల గొన్ని గుఱ్ఱంబులు నందు
పోయెపోయెనని యేటిలోనబడి పోయిరి కొందరును

ఆమెడమేటిలాదిగ కనుకొందరు పోయిరి యూళ్లకను
చిక్కినముప్పదిగుఱ్ఱములప్పుడు యెక్కియాకడను
తక్కినవారలు యెందరుపోయిరో లెక్కలేదువినను
సలాముసేయుచు నిలబడియుండగ సరదార్లందరును
బలేహుషారుతో మహమత్ ఖానుకు పల్కె రాజుతోను

**{ దేసింగును మహమత్ ఖానుకు యుద్ధముచేయుటకు ఉత్తరవిమ్మనియడుగుట }**

మనవివినుము మహారాజా నేనొక మాటచెప్పుకొనెద
చనినబాబుతో మొదటియుద్ధముకు సైయని నేజనెద
పోవుటకును నొకఘడియ యుత్తరవు పొసగనియ్యవలెను
దేవరవారలు సెలవొసంగుటలు సావకాశమేను
క్రమముగ కనమలుగొట్టిదండులో గ్రక్కున నేజొచ్చి
నిమిషమాత్రములోనన బాబును నేను నరికివచ్చి
మనవి జేసెదనుత్తరమొసగుము మన్ననతోడ తను
అనియడిగిన నా మహమత్ ఖానుని యపుడు జూచియనెను.

**{ మహమత్ ఖాను దేసింగు వొంటిగా యుద్ధమునకు బోవద్దనుట. }**

పకపకనవ్వుచు మహమత్ ఖానుని బహుశక్తి మెచ్చి
యొకడేకొడుకవు తల్లికి నీవు వొప్పదియిటవచ్చి
పసుపువస్త్రములు కంకణంబుచే పరగదాల్చియుటను
పసినాడవు వొంటిగ యుద్ధంబును పొసగజేయగను
నేను నీవునుగూడి యిప్పుడు నెరయదండులోను
పూనియుద్ధమున బాబుతోడను పొసగజేయుదమను
అనగ నిమహమత్ ఖానుండప్పుడు అని యా రాజుతోను
మనమిద్దరమును గూడిన బాబును మడియించిన నిలను
కబ్బును చిరకీర్తి విశేషము నెచ్చుగ దేసింగు

నా కేకీర్తియుగలుగ నేరదు నయముగ దేసింగు
అనవినినవ్వుచు దేసింగుండా మహమత్ ఖానునితో
చనిముందుగ నీవిప్పుడు యుద్ధము సలుపుమనగ నెంతో
శౌర్యంబున నా నీలవేణిని చయ్యాన తాటించి
ధైర్యంబున నానబాబుదండమును తానుజూచిమించి

### మహమత్ ఖానుడు ముందుసుభంగిధోర నెదిరించి యుద్ధము సేయుట.

పటపటపటయనిధవుడాయించెను పరగనీలవేణి
చటులపరాక్రమమున తానాప్పెను చయ్యాననటుపూని
వ్యూహము జేసుకనుండు దండు తానొప్పగానుజూచి
మోహరంబునను సుభంగిధోరను ముందుగనటుగాంచి
చాలగచిమటాయిచ్చెనప్పుడు నీలవేణికిని
మేలుగ యెడమకాలికిచ్చెను నీలవేణికిని
ఇచ్చినబిరబిరనీలవేణియు జొచ్చెదండులోన
చొచ్చినజూచిసుభంగిధోర తా నచ్చటవేగమున
మూను వేలగుఱ్ఱంబుల దెచ్చి మోహరంబు జేసి
తోచనె తానొక యేనుగునెక్కక తొడిబడనటుడాసి
నిలిచినమహమత్ ఖానుండప్పుడు నీలవేణికిని
చెలువంబుగ బొమ్మని సెలవిచ్చిన చయ్యాననటుపూని
చొరబడిగుఱ్ఱంబుల రౌతులను తరిమితరిమికొటను
కరుకుకరుక్కనిసారకాయలను నరికినతీరునను
గిరగిరమనుచునుకత్తిద్రిప్పుచును కినిసిదండునెల్ల
సరగుననరికిన మొండెంబులు ధర నరుదుగబడి డొల్ల
ముందునరుకునక్షమున్నా గుఱ్ఱము లందంబుగ దెగిమెఱ
కొందలమందగ వెనకవిసరుకు కొన్నిగుఱ్ఱములు పడియెఱ
యేనుంగులగుఱ్ఱంబులభటులను హెచ్చుగురౌతులను

మానకమహామత్ ఖానుండప్పుడు మడియజేసియటను
తోడిబడపేటసిపాయిసుభంగి ధోరనప్పుడుచూచెన్
తడయకనీలవేణికి సైగలు వడిగదిరుగుమనియిచ్చెన్
వచ్చెడిమహామత్ ఖానునియెదురుగ వైరులుబెదరగను
యెచ్చుగనిరుమూడ్వేలగుఱ్ఱముల నచ్చటనిలుపగను
నీలవేణినిధవుడాయించి వేలసంఖ్యలైన
చాలగకత్తితో తుండ్లుతుండ్లుగా కూలనేసిపైన
ఢీకొనివచ్చెడిదండునెల్లను తేగతోనరకగను
మోకరించెకొనిపడిరంతటను మొదటికనములోను
ఉన్నసుభంగిధోరసుకనుగొని కన్నులెఱ్ఱజేసి
యెన్నగగుఱ్ఱముతోడనువాని యేనుగుపైగదిసి
మహామత్ ఖాను సుభంగిధోరను మరినరికెదననగా
తహతహబడుచును కాళ్లుబట్టుకొని దనరవేడెవేగ.

{ మహామత్ ఖానుని
సుభంగిధోర చంపవద్దనివేడికొనుట. }

అన్నామహామత ఖానుడనీవు నన్నువిడువవన్న
మన్ననజేయుము నీతమ్ముడను నన్నుగావుమన్న
తెలియకయుద్ధంబునకువచ్చితిని చలమువలవదన్నా
కొలిచెదనిన్నిప్పుడు దైవంబుగ కొట్టవలవదన్నా
తల్లియునీవే తండ్రియునీవే దాతభ్రాతవీవే
యిల్లునిలుపు నేపిల్లలవాడను యిచటదిక్కునీవే
అనినసుభంగధోరనొకచెయ్యి నంతటబట్టుకొని
ఘనముగబలికెను మహామత్ ఖానుడు కడునుగ్రతప్రాని
పోటరివలె యుద్ధంబునకొచ్చి పొంకముచెడియిపుడు
మాటలాడి తేవిడుతు నేనిన్ను మడియింపక నేడు
యింతసిరికిబంటయి తేనీవును యింటనుండవలెను

కొంతసేనగొని యుద్ధంబునకును గొనకొని వచ్చినను
విడువనంచు యేనుగుపైనుంచి వేగదిగువ ద్రోసి
కడువడి కత్తితో కుడిభుజంబును కరుకని తెగ వ్రేసి
చంపబూనిన మహామత్ఖానని చయ్యన నటు జూచి
చంపవద్దని యెడమచేతితో సలామనుచు వగచి
గోడుగోడని సుభంగి ధొరపడి యేడ్వగ తానపుడు
విడుకొనయని మహామత్ఖానుడు విడువనంత వాడు
పరువడి నొక్క చెయ్యితో వాడు పరుగెత్తెననంత
తిరిగటు నీలవేణికిచిమటూ మరియిచ్చెను కొంత
బిరబిర దండులో జొరబడి కత్తిని గిరగిర ద్రిప్పుచును
తరుముచు నరుకుచును రుకుచు బలముల తడబడ జేయుచును
పదివేల గుఱ్ఱంబుల నొకసారిగ పట్టియు తుండించు
గదియించియు వా సేనల నెల్లను ఖండితము గ్రావించు
పక్కలు పిక్కలు చెక్కులు ముక్కలు వ్రక్కలు గావించు
అక్కడి వీరుల చక్కగ బట్టియు డొక్కలు వెసజించు
దండిగ గుఱ్ఱముల మొండెంబులు గా ఖండంబులు జేయు
చెండుచు నేనుగు తొండంబులను తుండ్లు తుండ్లు జేయు
మెడలు తొడలును కాళ్లు చేతులు కడువడి నరుకుచును
వడిగల శూరుల కడువడి బట్టి మడియగ జేయుచును.

మహామత్ ఖానుడు శేఖుమహమ్మదుతో
రెండవ యుద్ధము సేయుట.

వేయ్యేనుగులతో శేఖుమహమ్మదు వెలయుచుండ గాంచి
యవ్వేడకును యీమహామత్ఖానుండటు బోవగ దలచి
చాలగ మహామత్ఖానుడు చిమటూ నీలవేణికిని
మేలుగ యెడమ కాలికిచ్చెను నీలవేణికిని
యిచ్చిన నీలవేణి యప్పుడు నచ్చట నిలువకను

పశ్చిమదిక్కున శేఖుమహమ్మదు పగగదండములోను
వడిగా దూరుచుమహమత్ఖానుడు వదలక యేనుగుల
కడువడికండలుఁ ద్రెవ్వులుముప్పలు గా జేయుచుచాల
యేనుగగుంపులుకొండలువలెబడ నిలపొర్లగ నేసైన్
పీనుగుపెంటలు గాగనుమహమత్ఖానుడు తెగఁగోసెన్
యిటులనుండ నా శేఖుమహమ్మదు డేనూరేనుగల
పటుతరంబుగా ముందుఁబంపగని పటుకోపములీల
వచ్చునేనుగులమహమత్ఖానుడు వడిగా జూచుచును
హెచ్చినశౌర్యము తోడనప్పుడు నచటకత్తితోను
మొగబడినరుకుచు తెగబడిపోవుచు యేగుఁనేన్నియును
ధగధగమెరసెడికత్తినిఝుళిపుచు తెగువతో విసరగను
విరిగినకాళ్లుతరిగినమెడలును వొరిగినమొండెములు
వెరగుఁబడి యునే తెరవుగానకా తరినిలిచినభటులు
బిరబిర బారగనరుకఁ లుబడియును ధరగూలెడివారు
పరువులిడుచు నా మహమత్ఖానుని తిరిగిచూచువారు
యుద్ధము జేయుటకును రాలేదని యొదిగిచూచువారు
బుద్ధిలేకవచ్చితిమయ్యోయని పొగలుపట్టివారు
నిక్కంబుగమముఁజంపగవలదని మ్రొక్కివేడువారు
యెక్కడబోదము యేదిదిక్కుయని యిటులవగచువారు
యీరీతినినుండగదండెల్లను తారుమారునేసి
వారకనీలవేణికిచిమటూ వడిగానపుడిచ్చి
కదలిచిహయమును శేఖుమహమ్మదు కడకుఁబోవనిచ్చి
యదలించినవానీలవేణియును నంతచౌకళించి
యేనుగుతలమీదను తనకాళ్లను యెగిరిపెట్టగాను
తానటుమహమత్ఖానుడు గ్రుడ్డై దనరగబట్టియును
కత్తినీసుకొనిహుంకరించినను కనుగొనివాడంత

నెత్తికిసరిగా మహమత్ఖానుని నేయతప్పకంత
ప్రానికోపముతో మహమత్ఖానుడు వానితలను చేత
మానకకత్తితో వేయదలచినను మరివాడునుకొంత

శేఖుమహమ్మదు మహమత్ఖానుని
చంపవలదని వేడుకొనుట.

లేయుచుగడగడవణకుచుమరిమరి వేడుకొనుచు నేను
పోమొదవిడిచిపెట్టినహజరత్ ప్రోవుమినన్నను
కావుమనుచును కాళ్లుబట్టుకొని ఘనముగ నేడ్చుచును
సేవకుండ నీకును నేను కావు కావుము నేను
ఇల్లునువిడిచిబిడ్డలవిడిచి యిల్లాలినివిడిచి
వెళ్లివచ్చితినీవూరకెనిప్పుడు వేడుకగాదలచి
వచ్చితియుద్ధముజేయవచ్చిన వాడగాను నేను
యిచ్చుటప్రాణముబోగొట్టకన న్నిపుడువిడువవలెను
తల్లిదండ్రినీవని నేనిప్పుడు దనరగ వేడెదను
అల్లాసామివినీ వేయనుచును ఆరసికొలిచెదను
సలామయ్యావో మహమత్ఖానుడ సలామయ్యానీకు
బలేశూరుడనినిన్నుజూచుటకు మరివచ్చితినిటకు
ఇటువలెబలికిన శేఖుమహమ్మదు నటుజూచియు వేగ
పటుతరమైనవాక్యంబులచే పలికెనపుడు బాగ
ఇంతశూరుడవుయుద్ధానికినీ వేలవచ్చినావు
వింతలయిననీమాటలనిటనీ వెందుకుపలికెదవు
అనుచును శేఖుమహమ్మదునప్పుడు అంతకత్తితోను
తునకలుగా తెగవేసెను యేనుగు తోడనసదుగాను
అలసినిలువగానీలవేణియా మహమత్ఖానుండు
చల్ చల్ అనుచునుచూపుమేరలో చెంజిజూచినాడు
అనియీతెరగున నారదమునివరు డానతియ్యగాను

విని సురనాథుడు విస్మయమందుచు వేగనిట్టులనెను
మునినాయక యీ మహమ్మత్ఖానుం డెన్ని యేండ్లవాడు
ఘనముగు జగడమునందు శూరుడై కడగనిలచినాడు
పిమ్మట యేమి యొనర్చె దెల్పుము ప్రియముగ మునినాథా
సమ్మతితో విను చెప్పెదనిప్పుడు చయ్యన సురనాథా
మరి పదునెనిమిది యేండ్లవాడయా మహమ్మత్ఖానుండు
స్థిరముగ యుద్ధమునిదివరకెన్నడు జేయలేదు వాడు
యెనిమిది వేలగుఱ్ఱంబులను యెచ్చుగాను నరికి
పనిబూని యువెయ్యేనంగులను బాగుగా నరికి
మరలి తనదు హయమును నునిపేడుక పౌరుషజన్మము నీది
పరమముదంబున దేసింగునికన నరుగుమయిటమీది
వృత్తాంతం బేనొనరగ చెప్పెద మెత్తబడగ నేల
ఉత్తమాశ్వమా జరుగుమటంచని తత్తరమున చాల
తనరగ నెలువుచుతిరిగె మహమ్మత్ఖానుడు వేగమున
మనమున దేసింగుని జూచుటకై పరువిడు సమయమున

## మహమ్మత్ఖానుడు దేసింగుని వద్దికిబోగా బంగారు నాయడు ఫోనీయక యుద్ధము చేయించుట.

చూచెను బంగార్నాయుడు తనదగు సేనలు వచ్చుటను
యీ చెడు మహమ్మత్ఖానునివల్లను వచ్చెననుచు గను
చేయటు వీచుచు గుఱ్ఱపు రౌతుల చేర్చి గుంపుగాను
పాయక ముట్టడి వేయుడు కొట్టుడు పట్టుడు పరుగునను
అసితన సరదారులకు దెలుపుచును అట్టె తానువడిని
యినుసికై వడిని చురచుర మనుచును మొనసిన బోము ముడిసి
వేయుచు నేనూర్గుఱ్ఱపు రౌతుల వెలయగాను దెచ్చి
ఘుమురు ఘుమురనుచు వారికి బంగార్నాయుండు త్తరమిచ్చి

మొనలకు చుట్టును తన గుఱ్ఱంబును మోదంబున ద్రిప్పి
కనుగొని సేవల బారగ నీయక కాపు జేసి దప్పి
గొనిన వారలకు కైపు వస్తువులు కోరినట్లు నిచ్చి
మొనలో ధైర్యము విడుచుట తగు వా మనకని సెలవిచ్చి
దండనాయకుల గనుగొని పలికెను దాడి చేసి మీరు
కండక్రొవ్వు చేతిగెను మహామ్మఖానని రడిమీరు
చంపిన మీమీ జీతము లెల్లను చాల హెచ్చు జేసి
పంపునటుల నేమనివి చేసెదన బాబుతో డవాసి
మీరగ యుద్ధము జేయుండని వారల నెల్లను మెచ్చి
కార్యతంత్రములు మీరెరుంగరే కాల్బుడుదురమున జొచ్చి
మందుగుండులను కాల్బలంబులకు ముందుగ నిమ్మనెను
కొండలమందగ నిబ్బరంబునను కీర్తిగ నుండ నేను
అనితన సేనానాయకుడగు బంగారాయుడు దెలుప
మనములరగ సేనలు దెలివొందెను మానుషంబు గొలుప
తోటాలెత్తి రౌతులందరును పటుధైర్యంబునను
పటాలనుచును పంగ్లకోరికిరి పౌరుషంబుతోను
తుపాకులలో పోసగిపంపును తురగపు రౌతులును
సిపాయిబిడ్డలము మేమనివీ రాలాపములాడుచును
సనియను గొనిగట్టించితు పాకల నాయత్తము జేసి
మొనలో సరదారు త్తరువున కై మోపు జేసి నిలచి
ఉండగ తంబుర వాగెను ముందర జండాలటు వెనక
రెండు క్రోశము దూరము దెలియగ మెత్తిరి బలుకడక
ఫయురు ఫయురనును సిగ్నల్ జూపెను పరువడి మేజరును
వాయరొప్పియారనుచు మెత్తిరి చెవ్రలను వాయిలు మీరగాను
పటపటపటపటపటపటయనుచును వడిగా శబ్దములు
చటచటచటచటచటచటయంచును చెలగెను మిడుగురులు

గుప్పుగుప్పనుచుధూమంబెసగెను ఘోరంబుగనంతట
చెప్పశక్యమాసురపతియిప్పుడు తప్పకవినుమంతట.

**మహమత్ఖానుడు రెండవతూరియుద్ధము జేయుటకై రోసముగొనుట.**

మహమత్ఖానుడుతుపాకిశబ్దముల మట్టెంతనియెంచి
యాహామడంచెదనుతురకలనిప్పుడు నదియెంతనిమించి
నీలవేణిగుఱ్ఱంబునుద్రిప్పెను నీటుమీరగాను
కాలముదీరెనువీరికనుచును కడుకోపముతోను
చారుతుపాకులశబ్దమువినియా పౌరుషంపుహయము
వైరులచేదప్పించదలచియా వన్నెమిగులుహయము
మట్టికాలుతావేసుకనిలిచెను ముదముమీరగాను
పట్టుతుపాకులగుండ్లురవలుతమ తలపైనెగరగను
లేచెనుగుఱ్ఱమునడిచెనుకోపము రెపరెపమనగాను
కాచెనురౌతునుబ్రోచుకొనెనుతను రాచెనుకాళ్లటను
నాదొరయగుమహమత్ఖానునిగొని ముదమునమునసొచ్చి
కదనంబుననాకడకజూపెదను గాకనుమదినెంచి
పొంగెనుమించెనుబలయుక్తులుగ గలంచెనీలవేణి
వంగుచులేచుచుద్రావాలుచుధుముకుచు వచ్చెనీలవేణి
బిరబిరనడుచుచునాటలాడుచును చారుదెంచెనపుడు
సురసురచూచుచుస్రుక్కుచునిలుచుచు సొరదిననడిచెనపుడు
ఇటువలెగుఱ్ఱమునిమిషమాత్రమున చటురయంబుగాను
చటులతరంబుగనబాబుదండులో నీటుగజనగాను
గుఱ్ఱపురౌతులుతోటాలెత్తుక కోరుకునంతలోనా
వుత్తిలదరగనుమహమత్ఖానుడు బోరిగొనియెనుతన్నా
రౌతులుజూచెడినంతలోపలను రయముమీరగాను
మోతుబరులపదివేవురనరికెను ఖ్యాతిమీరగాను

కరుకుకరుక్కనిశబ్దమువినబడు నిరుప్రక్కలయందు
తరిగినకూరాకులవలెప్రోవులు తలలుబడియెనందు
తలలులేనిమొండెంబులునిలబడి తాండవంబులాడు
మొలలూడినతలలొడుగరచుచును మగ్గకనడయాడు
అప్పుడుకత్తినిఝుళిపించుచును మహమత్ఖానుండు
కుప్పించుచుతనగుఱ్ఱమువైరుల కొప్పించకమెండు
కోపంబునఖడ్గంబునువిసరగ కూలుజనులలెక్క
యాపద్మాత్మునకలవియెచెప్పగ నాపదాతిస్రుక్క
మహమత్ఖానుడుచేసినయుద్ధము మరిచెప్పెదకొంత
యూహానుబుద్ధికితోచినంతలో హెచ్చుగవినుమంత
కత్తిచేతగొనిమహమత్ఖానుడు కాలునివలెనిలచి
మొత్తెనుమున్నూర్వేలగుఱ్ఱముల మూలమూలలరసి
సుబేదారులనుజమేదారులను మేజర్సుబేదాలఁ
బాబువారిగాబిరుదులుగలిగిన బాబుసుబేదాలఁ
యేబదియారుమందినిజంపెను యిభములునేనూరు
కబళంబిచ్చెనుతనదుకత్తికిని కసిమసంగివారు
తుపాకిమొనలనుమున్మొనదీరిన తోరపుయీటెలతో
యీపాతకునిపొడిచెదమనుచును వేపరుగడనెంతో
కోపముతోడనునీలవేణినపు డాపురుషుడిగ్గి
యాపదాతులనుపదివేవురను యపుడుసమరియగ్గి
దగిలినదూదికొండలవడువున ధారుణిగూలగను
పగరెట్టింపగపట్టపగటిరవి వలెతామండుచును
యిరుచేతులకత్తులనుబూనియా పరసైన్యంబులను
పరుగిడనివ్వకకరుకుకరుక్కని వారియంగములను
చిదురుపలైభువిగూలగనేయుచు నీలవేణిజూచి
వదలకనావెన్నంటిరమ్మనుచు పౌరుషమునుగాచి

దేసింగునిజూడగబోవుదమని వాసిమీరగాను
గాసిజెందకనుమనముబయలుగా జేసినిలువగాను
చూచెనుబంగార్నాయండప్పుడు శూరవరునిసేత
పూచినమోదుగచెట్టురీతితన పోటర్లుండుటచేత
గనుగొనియరవైఫిరంగీలను పెనుపొందగదెచ్చి
వానరగవిడువక కాల్చుండనుచును యుత్తరవులనిచ్చి

{ మహమత్ఖానుడు దేసింగునిజూడబోవుచుండగా ఫిరంగీలచే కాల్చుట. }

ఈసన్నాహముబంగార్నాయం డేరుపరచుచుండ
వెసనేమహమత్ఖానుండప్పుడు వీరుడగుచుకొండ
పైడీపంబై వెలుగుచు నెక్కెను పరగనీలవేణి
న దెపదమన రాజునుజూడగని కదనమపుడుమాని
శంకరాభరణమనునదియొడ్డున పొంకముతోవిడిసి
జంకకమహమత్ఖానుండనిలో శంకలేకవెలసి
దేసింగునిజూడనుగోరుచుబలు తెంపుతోడరాగా
యాసేననుఢంఢంమనశబ్దము వెసవినగనుబాగా
ఫిరంగీలశబ్దంబులటంచును పేమిఁనిపేటసిపాయీ
తురంగమునుగనిదురంబునకనవ సరంబుగనుభాయీ
జల్దిగదిరుగుముదండుదిక్కునను సాఫుచేసిమనము
యొద్దికజనుదమటంచనిదెల్పగ తద్దయునాహాయము.

(మహమత్ఖానుడుగుండుతగిలి స్వర్గంబునకరుగుట.)

గిజ్జనిదిరుగనబాబుదండులో ఫిరంగకాల్పనట
యెజ్జగధంమనిగుండొక్కటిపడి విహగొమ్ము చాట
బ్రతుకికలేదనితెలుసుకమహమత్ఖానుండటు పేగ
పతినిగనుటపూజ్యంబితనువుతో మదినికగుండటుబాగ
అనుచునుగుండుతగలినరంధ్రము నందుగుడ్డలనుదూరిచి

కనుగవకెంపులుచెదరనప్పుడు కనలుచుహాయనునుతరిమి
చంపెనయుదునూర్వేలరౌతులను సంకోచింపకను
బొంపిరిబోవనిధీరశౌర్యముల బారిసమరెనటను
గుఱ్ఱంబులుయేనూరుమడిసెనా గురిపోటరిచేత
మిఱ్ఱుపల్లములుసమంబులాయెనా మొదముప్రోవుచేత
ఈరీతిగనొకగడియలోపలన నేకప్రజలవరికి
వీరుడుజీవమువిడువదలచితా వెసగుఱ్ఱమునురికి
పశ్చిమాభిముఖుడై గూర్చుండెను పాశంబులనడచి
నిశ్చలముగమదితనదైవంబును నిలిపిమోహమడచి
చేరెదదేవునిసన్నిధానమని శీఘ్రముకన్నులుమూసి
పారెడిమనసును పట్టినిలిపితగు భద్రంబటుజేసి
ఖురానులోగలకొన్నివాక్యముల ఘోషించుచునుడివి
కరుణాకరనీపదముజేర్చుము కాలమాయెననిపసివి
అల్లారేఅల్లారేయనినాతండల్లననప్పుడును
తల్లడమునదేసింగుడుగుండగ తాజనెస్వర్గమునకును
అంతటఅలరులుగురిసిరిసురులు అతిమోదముతోను
వింతవిమానమువచ్చినిలిచెనా వీరునిగొనిపోను
నత్తరిదివ్యంబగునొకతేజము నతనితనువువెడలి
తత్తరమందుచుప్రజలుజూడగను తర్లెవిమానంబడలి.

(నబాబుమహమత్ఖానునిగుఱ్ఱమును పట్టుకరమ్మనుట.)

మహమత్ఖానుడుపడిననబాబు మదిలోహర్షించి
సహజంబుగనాబంగార్నాయని చయ్యననటజూచి
బంగార్నాయుడమహమత్ఖానుడు మరినీల్గెనునేడు
శృంగారంబగునీలవేణిని సొంపుతోడయిపుడు
పట్టుకరమ్మివేగమెపొమ్మి బంగార్నాయడా
పట్టుపడనొపడదోమనకిప్పుడు బంగార్నాయడా

మూడు వేల గుఱ్ఱంబుల దీసుక మోహారంబుగాను
గాఢంబుగ గుఱ్ఱమును పట్టుకొని గ్రక్కున రమ్మనను
వేగమె బంగార్యాయుడు నాలుగు వేల గుఱ్ఱములతో
తెగువతో నీలవేణిని బట్టగ జాగ్రతగా నెంతో
పోయి చూడగను నీలవేణియును పొందుగ నచ్చటను
పాయని శౌర్యముతో డగుఱ్ఱముల పరువడి జూచియును
కనలుచు గర్జన జేయుచు నెగరుచు కడువడి దిరుగుచును
తన బలమున గుఱ్ఱంబుల నెల్లను తన్నుచు కరచుచును
గిరగిర దిరుగుచు బరువడి దుముకుచు కినిసి యునాడుచును
చొరబడి గుఱ్ఱపు గుంపులలో దూరుచు మరిమరి చంపుచును
కమ్మిన కాల్బలముల నెల్లను తన కాళ్లతో తన్నగను
దుమ్ములు మెగరగ గుఱ్ఱపు గుంపులు తుత్తుమురులుగాను
మిఱ్ఱుగ నిలచిన గుఱ్ఱంబులను మెడల నవుడు కొరికె
నెఱ్ఱవీగి వచ్చిన గుఱ్ఱంబుల వేగముగా నురికె
అంతట నాలుగు వేల గుఱ్ఱముల వింతచావు జూచి
చింతతో బంగార్యాయుడు దొరతో చెప్ప వెసను వచ్చి
కనిగుఱ్ఱము మనకలవి గాదని మనమున నెన్నుచును
ఘనుడగు మహామత్ఖానుని కేసరి గాకయున్న యెడను
ఇటులొనరింపగ నెవ్వని చేనగు తటుకున చూడగను
కటకట యేమనవచ్చును దీని పటిమయటంచనను
(దేసింగు నీలవేణివచ్చుట జూచి వ్యసనము నొందుట.)
నీలవేణియును వ్యసనము చేతను నిలచి జూచి వగచి
చాల దుఃఖముతో రాజు వద్దికిని చక్కరాగ జూచి
యేము చేసితివి మహామత్ఖానుని యిపుడు నీలవేణి
యేమాయెను నా ప్రాణసఖుండత డిపుడు నీలవేణి
నెచ్చటను మహమత్ఖానుడ బడ్ఢాడదియు జూపుమనిన

నచ్చటికినియా నీలవేణియును అరయగరమ్మనిన
పోయిశీఘ్రముగ మహామత్ఖానుని పొగలుచుతామించి
పోయెపోయెనా ప్రాణసఖుండని పొగడియునటుగాంచి
వాసిగనప్పుడు దేసింగుడు బల్ వ్యసనముతో దుతను
యీసునననిను నేవిడిచియొంటిగా నెటులనుందు నేను
నీవుముందుజని నాకొకజాగా నేరుపరచవయ్యా
నావకాశముక లేదునబాబును చంపివత్తునయ్యా
అనుచునుగుందుచునిట్టటుబడుచును నిలబడిపొర్లుచును
కనుగొనియేడ్చుచుకన్నులునూయుచు కడువ్యసనముతోను
మహామత్ఖానుకుగోరీయచ్చట మరియుకట్టుటకును
బహుశాపల్లముత్రోవ్వించెను నా పట్టునవయ్యాసను
పల్లములోనా మహామత్ఖానుని పట్టియుంచగాను
యెల్లవారలునుజూచుచుండగా నెంతోతెగువతోను
వచ్చియుగుంటచుట్టుచుట్టుచును వడిగనీలవేణి
యచ్చటనిలబడికన్నీరుంచెను నంతనీలవేణి
కనుగొనియప్పుడు దేసింగుడుతా ఘనశోకముతోను
మనమునగుందుచునీలవేణిని మహామత్ఖానునితోను
పనుపుటలెస్సనిఖడ్గముగొనితా పరగనరికెయంతా
ఘనముగ తేజినిపల్లంబునను కడగిచేర్చికొంతా
గోదానంబులుభూదానంబులు కోటిస్వర్ణములను
భూదేవతలకు సంతోషంబుగ పొందుగనిచ్చియును.

(దేసింగుమహారాజు నబాబుతో యుద్ధముచేయుట.)

తప్పక దేసింగుడునుతనజమే దారులనటుజూచి
యిప్పుడు పల్కెదనన్నలార మీ రందరువినమంచి
మహామత్ఖానునితో సగబలమును మడిదగ్గెను నాకు
సహాజంబుగ నాకేమిబలమును చయ్యానలేదిటకు

చయ్యనసిప్పాసునా బలంబుతో జేదండములోను
వొయ్యనజొచ్చినబాబునుపట్టి నేనునుచంపెదను
జాగ్రతతోడనురండు మీరలును జమేదారులారా
ఆగ్రహంబుననదండునమీరును జమేదారులారా
చొరబడిశూరులపట్టిచంపుడు గరిమెతో వారలను
నరుకుడు యేనుగుఖడ్గములనుమరి యతిధైర్యంబుగను
పరుగిడువారలపరువిడిమీరలు పట్టవలదుసుమీ
జరిగినవారలజడిసినవారల చంపవలదుసుమీ
యేమరియుండినవారలమీరలు నెదిరించగవలదు
మైమరచియులాహిరిచేనుండిన వారిజంపవలదు
అనుచును దేసింగుడుతనబారా హజారినటుచూచి
ఘనముగ పంచ్రెండంకెమ్ములుగల ఘనతేజినిగాంచి
చెలువుతో నెక్కిమీసముదీటి చేతకత్తిబట్టి
చల్ చల్ బాబాయనినడిపించెను ఖడ్గముచేదట్టి
సింగమువలెగర్జనజేసెను దేసింగుండంతటను
రంగుగపులివలెరొప్పినపుడు దేసింగుండంతటను
సబాబుకనుగొనిబంగార్నాయని నంతలోనబిలచి
దబాలువరుసగాఫిరంగీలను తయారుజేయించి
మనదండెల్లనునొక్కచోటను మరిమోహరముగను
ఘనముగబెట్టుముబంగార్నాయడ గ్రక్కునసిప్పాసును
శూరుడయినదేసింగుడువచ్చెను జూడుమిపుడువాని
బారహజారినెక్కుకవచ్చెను బరువడినిటవ్రాని
అటులనుండినదేసింగుండును యాదండులొజొచ్చి
పటుశరంబుగనుచిమటాయిచ్చెను బారహజారనిమెచ్చి
యిటులహజారనిచిమటాయిచ్చిన పటపటపటయనుచు
పటుతరముగనిటువచ్చినగనుగొని వరుసఫిరంగీలిడుచు

ఒక్కఫెళీ తాంఢాంఢామనుచును యొక్కడకాల్చగను
చక్కగవచ్చియుగుండుసందులో గ్రక్కునదూరగను
బారహజారితోడనుపొగలో బడిపడిదూరుచును
మార్ మార్ మారని దేసింగుడువడి జేరినరకగాను

(దేసింగుడు దావుత్ ఖానునితో బోరుట.)

చేతిపట్టు దావుత్ ఖానుడు చెచ్చెరజొచ్చియును
ఘాతవేయుచును పెద్దఫిరంగుల కడవడికాల్చుచును
నంతరేకలాఫిరంగీలను గొంతకాల్చిరపుడు
నంతవెనకయేనూర్ గుఱ్ఱంబుల నమరబంపినాడు
మందుపోటుకును గుండుపోటుకును సందేహించకను
సందునబడిదూరుచు పైకెగరును సరగునహయములను
గరగిరద్రిప్పుచు నెగరవేయుచును కరికరిసేయుచును
పరగునదండుతండంబులస వ్యాపసవ్యములు గాను
తరుముచునరికెను దేసింగుండును కరుకుకరుకమనుచు
మరిగుఱ్ఱంబులతొండ్లుతుండ్లుగా నరికినరికివేసు
అరటికంభములనరికినకరణిని యంతదండునెల్ల
సొరకాయలతెగనరికినకరణిని సొరదిసేననెల్ల
జొన్నదంట్లతెగవేసినతీరున చొరబడిదండునను
వున్నవారినటుచాపకట్టుగా నుక్కడంచుచూను
ఇటులజేయుగా దావుత్ఖానుడు చటులకోపమునను
పటుతరముగ పదివేలఫిరంగుల పదిలపరచియటను
ఒక్కఫెళీ తాతీచినాడయా వృద్దండంబుగను
చక్కగ పెట్ పెట్ పెతాలనుచును శబ్దంబులతోను
వచ్చెడిగుండుకు పైకినెగసెను వాపస్గా గుఱ్ఱమును
అచ్చటిపొగకును పైకినెగసెను చెచ్చెరగుఱ్ఱమును
చిక్కనవారిని గ్రక్కునమారెను పెక్కువిధంబులను

నెక్కుడజూచిన దేసింగునివలె నెక్కుడనుండగను
మరుగుజేరుచును పరుగులెత్తుచును తిరిగిచూచుకొనుచు
విరిగినదండును దావుత్ఖానుడు వెసనుజూచివగచు
దండునెల్లనొకచోటనునిల్పి ఖండితంబుగాను
మెండుగముప్పదివేలతుపాకుల మేటిశబ్దములను
ఒక్కఫళీ తాతీచి నగుండ్లను వెక్కసంబుగాను
పెక్కువిధములై మండెడిమంటలొ ప్పేర్చియు గుళ్లమును
మెగిరిదాటుచును పొగలోదూరుచు యిటునటుదిరుగగను
దిగువబడిరి యానబాబుదండు తెరలుమంటలోను
వేయుగుళ్లములునొక్కసారిగా వేగరాగజూచి
నామెడబారాహజారి దాచెను నంత దానిమించి
ఒక్కకత్తిపై వెయ్యికత్తులు వొక్కసారిరాగా
వెక్కసంబులేకను దేసింగుడు విరిచెనన్ని వేగా
చాలగ దావుత్ఖానుడు నుపది వేలగుళ్లములను
మేలగు రౌతులతోడను బంపెను మిక్కుటంబుగాను
వచ్చినగుళ్లంబుల దేసింగుడు వరుసగాను జూచి
యిచ్చెనుచిమటా బారహజారికి యెడమకాలిమించి
పటపటపట యనిధవుడాయించెను బారహజారియును
చటులకోపమున దేసింగుండును దావుత్ఖానుడను
యెదురుగ బారాహజారి ద్రిప్పెను హెచ్చుశౌర్యమునను
అదిగనుగొనియా దావుత్ఖానుడు మదవేనుంగులను.

{ దావుత్ ఖానుడు మదమేనుంగుల సమూహములను దేసింగునిపై గదియబంపుట. }

అరువదివేలమాపటీలతో నెచ్చుగానువచ్చి
సరగునతొండంబున నొకండ్లను చక్కగాను దాల్చి
విసరుచువచ్చెను నలుదిక్కులను వెసన జనులు బెదర

కసరుచు వచ్చి దేసింగునిపై క్రమ్మె కొండలదర
ఘీంకారింపుచు తొండము లెత్తుచు గిరగిర దిరుగుచును
శంక లేక రోకండ్లను ద్రిప్పుచు చాలగ వచ్చినను
చూచి యప్పుడు దేసింగుండును చోద్యము బొందుచును
యోచింపక నాయేనుగు గుంపులో నొప్పుగ గుఱ్ఱమును
కదలించి కనలుచు తాపడి జొచ్చి కడునుగ్రుండగుచు
పదిలముగా తన చేతను బాలా పట్టి విజృంభించు
తొండంబుల నెల్ల నువడి నరికెను తుండ్లుతుండ్లుగాను
గండస్థలముల గ్రుచ్చి యెత్తెను కండలు రాలగను
మొండెములు తెగ నరికెను యాబల్ తండంబుల నెల్ల
మెండుగ నెత్తురు ఱేపై బారెను మేటి దంతులెల్ల
బరువడి కుంభస్థలములు పాడియై బడెనప్పుడు కొన్ని
నడికి నంతలో రెండు తుండ్లుగా నటుగూలెను కొన్ని
కాళ్లు చేతులతో కలుపిరిగ కదసి కూలె కొన్ని
వాళ్లెల్లను చిల్లుల పోటులు బడి వారిగ నంత కొన్ని
పేగులు కండలు వేరువేరులై మూగగూలె కొన్ని
సాగలబడి పాల్గింతలు బెట్టెను చయ్యన నటు కొన్ని
ఆరీతి తార్ తార్ తార్ జేసెను అప్పుడు దేసింగు
బారహజారికి చిమటా యిచ్చెను బరువడి దేసింగు
దావుత్ ఖానుం డుండెడి తావుకు తడయక ద్రిప్పగను
దోవ లేక యాపీనుగు పెంటల ద్రొక్కుచు నంతటను
యేనుగు పైనుంబాలో దావుత్ ఖాను నంత జూచి
మానక దేసింగుండును చిమటా బారహజారికి నిచ్చి
యెడమ కాలికి నివ్వగ నప్పుడు యెగిరి యుదుముకుచును
తడయక దావుత్ ఖానుని యేనుగ దగ్గర నిలువగను
చెలరేగి యుతన బారహజారిని చేత తట్టగాను

నిలచియుండరి గాళ్లను యేనుగ నెత్తినపెట్టగను
కడుకోపముతో మావటివానిని కదసి చేతబట్టి
పడిగలకత్తినిఝళిపించ ప్పుడు వానితల నగొట్టె
ఉగ్రుడగుచుయా దావుత్ ఖానుని వాడిసిపట్టగాను
నిగ్రహింపలేకను దేసింగుని నెనసిపోగడుటకును.

{ దావుత్ ఖానుడు చంపవలదని వేడుకొనగా దేసింగు
నబాబువీడే యనినిశ్చయించి యమపుకను ప్రుట. }

అప్పుడు మనమునని శ్చయించివో యన్నా దేసింగు
తప్పక నేనీకాళ్లకుమ్రొక్కెద దనరిగ దేసింగు
విడిచిపెట్టినను పరువెత్తెదను వేగమె దేసింగు
బడేశూరుడవుదయనన్నేలుము బాలుడ దేసింగు
ఆనవిని దేసింగుడు దావుత్ ఖానుని వేగమె జూచి
ఘనుడగు నబాబువీడే యనుచును కడువడిమదినెంచి
బాలా వేసిన దావుత్ ఖానుడు బడికీలిగెనపుడు
చాలగ నబాబుదండులో నందరు సరిగ బారిరపుడు
కొందరు బారుచు నేలగూలుచును కొందలనుండుచును
కొందరు దాగుచు తిరిగిచూచుచును కొందరువగచుచును
నబాబుకొండలసందున దాగెను నతిభయము మొదవగను
నబాబు సేనలు పటాపంచలై నటుచెడబారగను
తత్తరపడిపరుగెత్తువారిపై కత్తియెత్తరాదు
నత్తలేకనిలచినవారలపై కత్తియెత్తరాదు
యిరువదియారువత్సరములవాడిప్పుడు దేసింగు
సరగున యాభై వేలగుఱ్ఱముల జంపెను దేసింగు
రెండువేల యేనుంగులుంగుఱ్ఱను దండిగ దేసింగు
మెండుసేనలనుజంపెనప్పుడు మేటిగ దేసింగు
యిరువదినాలుగుఝుండాలన్నియు బరువడి దేసింగు

సరగున పెటపెట ద్రుంచివేసెను చయ్యాన దేసింగు
అప్పుడు దేసింగుడు నెయ్యాలసి నపుడు తానునిలచి
యొప్పుగ నెత్తురుగాలువుడ వులను కప్పినంత జూచి.

{ దేసింగు దావుత్ ఖానుని జంపి
శంకరాభరణనదిగట్టున గూర్చుండుట. }

ఇంక నేలయానబాబు చచ్చెను శంకలేక నేను
శంకరాభరణనదిలోపల నే స్నానము జేశటను
పోయెదననుచును యిదగుఱ్ఱముల పొందుగానుగూడి
ఆయెడ బారాహజారి నెక్కియు నంతనచట జేరి
వచ్చి శంకరాభరణముగట్టున వదలక తానిలచి
అచ్చట బారాహజారిడిగ్గి యంతనీళ్ల జొచ్చి
ఉడుపులగడుగుకక్తినికడిగెను నొప్పుగ దేసింగు
బడలికదీరగ స్నానము జేసెను బాలుడు దేసింగు
మూడు దోసిళ్ళ నీళ్లు నద్రాగెను మరియును దేసింగు
నీడను జేరికూర్చునెనప్పుడు నిజముగ దేసింగు
సహజమున బాబును చంపితిమనుచును సంతోషించుచును
మహమత్ ఖానుడు పోయెననుచును మదిగుందుచును.

{ ధనసింగుడను దాయాది దేసింగునివద్దికివచ్చి
నబాబునిచే జావలేదని దెలుపుట }

యిటులనున్న దేసింగునివద్దికి తటుకుననప్పుడును
పటుతరముగ ధనసింగుడువచ్చి పల్కెనతనితోను
రాంరాంసీతా రాంరాంరాంరాం రాజా దేసింగు
రాంరాంరామనె బదులుకనప్పుడు రాజా దేసింగు
సరగునవచ్చిన పనియేమిర నా సామి దేసింగు
యిరవుగయుద్ధము విడిచివచ్చితే విప్పుడు దేసింగు
ఆమాటలువిని దేసింగుడు తా నప్పుడు నిట్లనెను

యేమియున్నదికనభాబుచచ్చెను యింకయుద్ధమునను
ధనసింగుడు నామాటలువిని తత్తరపడియిట్లనెను
దనరగనీచేజచ్చినవాడును దావుత్‌ఖానుడును
సగముబలముపోయినదనిగుందుచు సంకటమొందుచును
వగచెడియుద్ధముచేయలేముకని పొగలినబాబటను
కొండలసందునసాదుల్‌ఖానుడు కోరిదాగినాడు
తండెల్లనునీచాడికోర్వకను దాగియున్నదిపుడు
శత్రుశేషమింతయిననునిల్వగ జనదిక దేసింగు
మిత్రుడవనినేనీకుదెలిపితిని మేలగు దేసింగు
జల్దీజల్దీబయల్‌దేరుమీ జలిదిగ దేసింగు
వలదునిలపగనుసభాబుకూల్చుము జలిదిగ దేసింగు

{ రంగనాథుడు దేసింగుయుద్ధమునకుద్యుక్తుడైనంతట
బోవలదని బుద్ధులుగరపుట. }

అతనిమాటలువిని తానలరుచు నంతట దేసింగు
మితిమీరినసంతసమునబొందలుచు మీరెను దేసింగు
బారహజారినిదగ్గరతెమ్మనె బరువడి దేసింగు
శూరత్వంబునకత్తినిబట్టెను సొంపుగ దేసింగు
నారాయణశౌరీయనిమొక్కెను బారహజారిపైని
ధీరుండార్గురుసరదారులతో తెంపునగూడుకొని
వెడలగతనపాలిటిరంగేశుడు వెనకనిలువగాను
కమవడిదేసింగుడురంగేశుని కనులపండువుగను
కనుగొనిశ్రీహరిపాదపద్మముల కప్పుడుమ్రొక్కుచును
నినునమ్మితిశ్రీరంగనాయకా నన్నువిడచుటకును
పనిగాదురయీసమయంబునను పరగరంగనాథా
అనువుగ నన్నలకతొలంగినను యపయశస్సుగాదా
అనిపలికినశ్రీకస్తురిరంగం డతనిజూచిమెచ్చి

పిన రాయుద్ధముయీదినమందున వేడ్కతోడ జేసి
బహు ప్రయాసపడియలసినవాడవు బాలుడ దేసింగు
సహజంబుగ రేపటికినిజయమగు చయ్యాన దేసింగు
బాలుండవు నామాటలు వినుమిక బరువడి దేసింగు
చాలు చాలు యీదినమున యుద్ధము చాలుర దేసింగు
మూడుమ్ముక్కాల్ గడియవరకు నే ముదమున్నోదవగాను
తోడుగనుంటిని యీదినంబునిను కూడనింక నేను
నీకు సహాయముగాను రేపటికి నిశ్చయంబుగాను
ప్రాకటముగ నేబోయివత్తునా పల్కులు వినుమనెను
ఘనమగు తన శూరత్వము దెలియగ కనలుచు రంగనితోను
మొనగాడగు దేసింగు రంగని గనుగొని యిట్లనెను
ప్రేమతో మీదయ యీగతినుండగ నేమికొదవయికను
స్వామీ నామాటలు వినుమిప్పుడు సరగున జెప్పెదను
చయ్యన యుద్ధములోనన బాబును చంపెదననదియొకటి
యయ్యెడ నాతని చేతనసువులను నొయ్యవిడచుటొకటి
ఆరునూరులో చావులు దప్పదు యదినిశ్చయమయ్యా
ధీరులయినవారికి ప్రాణముపై దృష్టికలుగదయ్యా
దండులోన జయమొందగ నీకృప దయ సేయగదయ్యా
దండునసిల్గినవారికి నీదగు దండం దండగదయ్యా.

(దేసింగుడు రెండవతూరి యుద్ధమునకు బోవుట.)

పోయివత్తునని బారహజారిని పొందుగ నెక్కికోని
పాయక నెడమకాలికిచిమటా పరగనివ్వడిని
పటపటపటయని చప్పుడాయించెను బారహజారియును
తటుకున దండునుండు తావునకు దగ్గరబోవగను
ఉండున బాబుదండుల్లో వారును వొప్పగానునప్పుడు
దండియైన దేసింగు నవ్వారికి తానుపోయివాడు

యింకమీదమనకందరకునునిపు డేమిభయంబనుచు
శంకలేకమనవూరికిబోదము చయ్యానరండనుచు
అంతనబాబునుగూడిగుంపుగా నచటనుండగాను
చెంతకువచ్చినయా దేసింగుని సరగనబాబటను
చూచిసింహమునుగన్నమదేభము చొప్పునవడకుచును
ఆచెంతనుపులిగన్నలేడివలె యట్టిటుబెదరుచును
పిల్లినిగన్నచిలుకచందమున బెదరుచుజూచుచును
వల్లదప్పివలలోబడినట్టి వనమృగంబువలెను
అదరిపడుచునట్టిట్టుజూచుచు పెదవులుదడుపుచును
యిదెవచ్చెనుదేసింగుడునికనే నేమిసేతుననెను.

{ నబాబుతోండ్రమల్లునిబిలిచి దేసింగునికడకు
సమాధానమునకు సంధికనుపుట. }

గడగడవడకుచుతోండ్రమల్లుని వడిగనపుడుబిలచి
తడయకబల్కెనునబాబప్పుడు తప్పకతనిజూచి
తొందరగలిగెనుయేమిసేతునో తోండ్రమల్లన్న
ముందుగనాప్రాణములుగాచుటకు ముఖ్యుడవీవన్న
అనిననబాబుతొ తోండ్రమల్లుడు అప్పుడిట్టులనియెక్
పనియేమికసెలవియ్యుండన్నన బాబతనితోననియెక్
దేసింగుడుమనదండులనెల్లను తెగువతొ ఛేదించి
భాసురముగవాడూరికేగెనని భయమువిడిచిమించి
ఉంటినియిదె దేసింగుడువచ్చెను వొప్పుగానువాని
కంటజూచుటకుభయముగనున్నది గట్టిగనామదిని
ఒక్కకార్యమున్నదినేనిప్పుడు నొప్పగచెప్పెదను
చక్కగానునీవతనికినాకును సంధిసేయవలెను
దొరతనమునునీకిచ్చెదననుచును తోండ్రమల్లోజీ

సరగన నార్కాడ్వేడ్కనేలుమను చయ్యానమల్లోజీ
పట్టముకట్టించెదనని యానితో బలుకుము నీవన్న
పట్టుగ నాయార్కాడునీదియని పలుకుము నీవన్న
నేనుబంటుగా నతనిగొలుతునని నిజముగ పలుకన్న
మానక నేనీ దాసుడననుచును మరిమరి పలుకన్న
యిటులన బాబుతోండ్రమల్లుతో పటుతరంబుగాను
తటుకున దెలుపగ మదిభయంబుగొని తడబడి లేచియును
సలాముచేసి తోండ్రమల్లుడు చయ్యాననటువచ్చి
బలేశూరుడగు దేసింగునికి మరియెదురుగవచ్చి.

(తోండ్రమల్లోజి దేసింగునికి సంధి జేసుట.)

రాంరాంరాంరాం రాంరాంరాంరాం రాజా దేసింగు
శ్రీరాంరామ నెబదులుకునప్పుడు రాజగు దేసింగు
భయముజెంది నేవచ్చినానయా బాలుడ దేసింగు
దయతోడుత నామనవివినుమయా తడయక దేసింగు
చెలువుమీరగాన బాబుమీతో సంధిసేయుమనెను
చలముసేయకను వినుడు జెప్పెదను సవిస్తరంబుగను
దొరతనమునునీకిచ్చెద నేను బరువడి దేసింగు
సరగున నార్కాడ్వేడ్కనేలుమనె స్థిరముగ దేసింగు
పట్టమునీకే కట్టెదననుచును పలికెను దేసింగు
పట్టుగ రాజ్యము నిన్నేలగమనె బాలుడ దేసింగు
నీకుబంటనై నేనుండెదననె నిజముగ దేసింగు
జోకతోడనీ దాసుడ నేననె సొంపుగ దేసింగు
యిటులన బాబు చెప్పి పంపెను యిప్పుడు దేసింగు
పటుతరముగ శ్రీరామవాక్యముగ బలికెను దేసింగు.

## దేసింగు తోండ్రమల్లోజితో యుద్ధము జేయుటెను క్రమనుట.

అన్నన ప్పుడా తోండ్రమల్లు గని యంత నుగ్రుడగుచు
కన్నులెఱ్ఱగను జేయుచు పలికెను ఘనకోపుండగుచు
మఱి యీమాటలు యేలను తోండ్ర మల్లోజిప్పుడును
బరువడి యుద్ధముఖంబున బలికెడు పలుకులె యివియా నేను
నాడు నీవిటుల సంధికి వచ్చిన నప్పుడు వొప్పుదును
నేడిటు పలికిన నాటి బీరములు నేయుడ వినిజ నేను
దనరన బాబుకు హితుతగు దావుత్ ఖానుడు పోవుటను
ఘనుడగు నాస్నేహితుడగు మహమత్ ఖానుడ నీల్గుటను
ఇద్దరు శూరులు తెగిన వెనక మా కింక మాటలేల
యుద్ధము జేసియు నూ బలంబుఃతో నొప్పగనీ వేళ
జావగ వలయును గాక యింక యీ సంధి యేటికనెను
సాపు జేయవలెదండులో తెగబడి చయ్యన యిప్పుడును
శూరులయిన తురకలు మీరింతయు ధైర్యపడగనేల
వీరుడయిన మీ నబాబుకిప్పుడు వేరె మాటలేల
పకపక నవ్వుచు దేసింగుడిటు పలికియ తనితోను
యిక నొకటున్నది తోండ్రమల్లు నే నిప్పుడె జెప్పెదను
చెలగిన బాబుకు బలము గలిగితే చెంజి సేలుమనుము
బలము నాకు గలిగిన నార్కాడు దక్ర బలము గనలేదను
యీ విధములు గాకిప్పుడు వేరే యేమిలేదు వినుము
నా విధమంత్రయు మీ నబాబుతో నరయ బలుకబొమ్ము
జలదిజలది మీ నబాబు నిప్పుడు జలదిగ రమ్మనుము
జలదిగ సేసి దోవ చెప్పెద నీవును జలదిగాన బొమ్ము
మరిమరి సలాము జేసియు తోండ్ర మల్లుండప్పుడును

తిరిగినబాబుకువిశదంబుగనీ తెరగెరిగించగను
అదరిపడియుబంగార్రాయనితా నంతలోనజూచి
పెదవులుదడుపుచుపలికెనప్పుడు పెంపుదప్పిలేచి
యేమిసేయుదునుబంగార్రాయుడ యేమితోచలేదు
యేమిచేసిననునీదేభారము యేమరకికమీదు.

{ బంగారువాయుడు దేసింగునిమీదికి వేంకట్రావును సేనాసమూహముతో యుద్ధమునకుబంపుట. }

అనవినిబంగార్రాయండప్పుడు అతిధైర్యంబునను
ఘనుడగు వేంకట్రావునుజూచి కడువేగంబునను
శంకలేకయేనూర్గుఱ్ఱములను వేంకట్రాయుడా
యింకతీసికొనికమ్మిటుజలిదిగ వేంకట్రాయుడా
దేసింగునికినియెదురుగబొమ్ము తెగువతోడనిపుడు
వాసిమీరగనుయుద్ధముచేయను వదలకజయునేడు
సరగునయబ్దుల్ఖాదరుఖాను సాయబుదండునను
బరువడికోలుముత్ఖానుడునీకు మరిసహాయముగను
వచ్చెదరిప్పుడువేగమెబొమ్ము వారిగూడియునిన
నచ్చటనందఱుదండుగూర్చుకొని వచ్చినిలచియున్న
దేసింగుండటుబారహజారిని తెగువతోనెక్కికొని
వాసిమీరగనుచిమటాయిచ్చుచు వదలకనటుపూని
దడదడదడమనిధవుడాయించెను దండుమీదికపుడు
గడగడమనుచునువడకిరిదండులో గలవారలునపుడు
చూచివిభ్రమముచెందిరికొందరు సోలిరికొందరును
ఆచెంతనునిలువకపరుగిడిరి నందునకొందరును
మేముయుద్ధమునకునురాలేమని మెలగిరికొందరును
మోమువంచుకొనిచేతులెత్తుకొని మ్రొక్కిరికొందరును

కలదండెల్లనుజూడగయిట్టిటు కల్లోలంబగుచు
వెలవెలబారుచునిట్టటుజూచుచు వేమరుగునజనుచు
యిట్టులుండుతరిదండునజొచ్చెను చట్టనదేసింగు
పట్టుగపట్టాకత్తినికరమున పట్టుకదేసింగు
గిరగిరబారాహజారినప్పుడు గరగిరద్రిప్పుచును
కరుకుకరుక్కనితలలనెల్లను కరుకనినరుకుచును
గుఱ్ఱంబులగనిరెండుతుండ్లుగా గురుతుగనరుకుచును
పిఱ్ఱపిగురౌతులతలలురులగ విసరుచునరుకుచును
రౌతులనెల్లనుతలలుకాళ్లును చేతులునరుకుచును
ఘాతవేయుచునుయిట్టటుదిరుగుచు కదనరంగమునను
కరములుశిరములునురములునరములుమరితెగవేయుచును
చరణంబులుదేహావరణంబులు నురుములుజేయుచును
తావులుదప్పిప్రేవులనెల్లను ప్రోవులుజేయుచును
కావుకావుమనివేడినవారల గ్రక్కునవిడుచుచును
నీవెదిక్కనినమ్మితిమన్నను నెనరునవదలుచును
సేవకులమునినుకొలిచెదమన్నను చెరపకబ్రోవుచును
యీరీతినిమారోమారనిబలుకుచు శూరుడుదేసింగు
పోరుచుపోరుండనిరౌతులతో పోరెనుదేసింగు
అప్పుడుఆరణివేంకట్రాయుడు వొప్పుగదండునజూచి
గొప్పయేనుగుపైనుండెడివాని నప్పుడంతగాంచి
చెలువుమీరయాబారహజారికి చిమటాయివ్వగను
కలకలమనుచునుగర్జనజేయుచు కదసిపోవగాను
శీఘ్రముగాదేసింగుడుతేజికి చిమటాయివ్వగను
ఆగ్రహంబుననుముందరితనకాళ్లంతయెత్తియాటను
యేనుగుతలపైబెట్టినంతలో తానుకోపమునను

వానిజూచియునుమావటివాడును వడవడవణకగను
దేసింగుండునుమావటివానిని తెగువతోనరకగను
వానితప్పి వేంకట్రామప్పుడు వడవడవణకగను
పట్టుకొయుతెగనరకపూనగను బదులుపలికితేను
వెట్టులోనాయనివేంకట్రాయడు నెంతోబెదరుచును
నిలువంగీలనువిప్పివడిగతా జంధ్యముజూపుచును
చలముసేయకుమ బ్రాహ్మణుడనునను చంపగజనదనెను
చూచిబ్రాహ్మణునిచంపగూడదని సొంపుగదేసింగు
వానిమీరగనునావలిదండుకు వచ్చెనుదేసింగు
యెడమకాలికిచిమటాయిచ్చెను యంతటతేజికిని
కడువేగముతో దేసింగుడుఘనకత్తిచేతబూని
దోసకాయలనుకోసినట్టుగా తోడిబడనరుకుచును
వానిగబెంకాయలబుర్రలవలె వడితలలటుపడను
ఖుడిమేలపుమ్మృష్య్యవవలెబట్టి మెడలటువిరుచుచును
కడువడియాడపులకాల్చుచువచ్చెకి కాలాగ్నియువలెను
పొంగుచుచునరుకచుకత్తివెత్తుచును పొడిపొడిజేయుచును
వడిగలయేనుగుగుఱ్ఱంబులమరి తోడిబడనరుకుచును
వాలుకోట గుబ్బుల్ఖాదరుని వదకపట్టుకొని
చాలగరెండుతుండ్లుగనరికెను సరగకత్తిబూని
కళ్లకురంజిఖానసాయబును ఖండతుండ్లుచేసి
కల్లికోట యేల్కోలుముత్ఖానుని కత్తితోతలకోసి
వధురవేలుమళయాళపువానిని మరితలతెగనరికి
యదలించియుపీరులనటుబోలి యావలికనియుటికి
సరగనచాటటుయున్నపాళెమును చక్కగానుజూచి
త్వరలోచిమటాబారపజారికి మరియిచ్చియుమించి

ధగధగమెరసెడికత్తిచేతను తానటుఝళిపించి
నిగనిగమెరసెడిబాలాచేతను నేర్పుగధరియించి
యేనుగుపైనున్ననట్టినబాబును తానంతటజూచి
పూనికబారహజారికిచీమటా పొందుగానుయిచ్చి
నందునబారాహజారియప్పుడు నతిధైర్యంబుగను
ముందరికాళ్లటుయేనుగుతలపై మోపుగపెట్టగను
అప్పుడుదేసింగుడు తనచేతను అంతకత్తిబట్టి
తప్పకమాష్టీకునిచేయిబట్టి తలతెగబడగొట్టె.

(నబాబుదేసింగునితన్నువిడిచిపెట్టుమనివేడుకొనుట.)

బాలాచేతనుధరియించినయా నబాబతనిజూచి
చాలగదేసింగునితోననెను మేలుపొగడదలచి
యుద్ధముచేయగనెవరాలేదు వొప్పగదేసింగు
యుద్ధరంగ్లో నీసమానులెవ్వరు యిప్పుడుదేసింగు
నారాజ్యమునీకిచ్చెదనయ్యా నన్నువిడువుమయ్యా
ధీరత్వంబునయాగాకడిప్పుడు జేరివేలుమయ్యా
ఒక్కకోట్లకేనూరుకోట్లలు వొప్పగనిచ్చెదను
ఒక్కచెరకునేనూరుచెరలును వొనరగనిచ్చెదను
సీమామూలమునీకనిచ్చెదను స్థిరముగదేసింగు
మామూల్ శాసనమునుకిచ్చెద మరిమరిదేసింగు
నామీదనుదయచాలావుంచుము అయ్యాదేసింగు
నీమీదనుయుద్ధానికిరాలే దిప్పుడుదేసింగు
నన్నువిడిచితే పారిపోయెద నప్పాదేసింగు
చిన్నవాండ్లనువిడిచివచ్చితిని చెలువుగదేసింగు
సలాంజేసెదనునన్నువిడువుము చయ్యనదేసింగు
బలేశూరుడవునిన్నుమెచ్చితిని బరవడిదేసింగు

నిజముగ నాపాలల్లాసామిపి నివేదేసింగు
గజిబిజియాయెను నాప్రాణములు కనుగొన దేసింగు.

(దేసింగుడు నవాబుతో యుద్ధముజేసుట.)

వెలవెలబోయిన నవాబుతోడను వేమరుపల్కుచును
చెలువుతోడయా నవాబుగనుగొని కలకలనవ్వుచును
సంధిచేయుటలు నాడేయుండెను సాదుల్ఖానుండా
యెందుకయిన్నిమాటలాడెదవు యిచ్చటనాతోడా
మొదటతోడ్రమల్లోజితో చెప్పిన మాటలుమరచితివో
యెదుటనిలువనను దేసింగుండని యిప్పుడు నెంచితివో - నీకు
మాట యెనిమిది పాళాల్ పైకం బొప్పగనుండగను
ధాటిగ చెంజీరూకలు లేకను తక్కువాయానటను
నీకుబలంబులు జమేదారులు నిజముగనుండగను
యీకొలదినిబలుకగదగునా నీవిప్పుడుచులకగను
చెంజిపైకముతీసుకొనుము నా చేతికత్తిమొనను
రంజితంబుగా రూకలు జూడుము రయముగ బాలామొనను
పట్టుపట్టురూకలుయిదెవచ్చెను పట్టుమనుచునతడు
దిట్టముగాతనచేతను బాలా పట్టియెత్తియపుడు
తలమీదికియిదో బాలావచ్చెను తప్పించూకొనుము
చెలువుతో కత్తిమెడకువచ్చెను తలగకయిటునిలుము
కినిసినీవు నాతోనికనైనను గెలువుసమరమునను
అని దేసింగుడుపలుకుచునుండగ నాసమయంబునను.

{ ఏనుగకడుపుక్రిందగట్టినతొట్టినుండు మాష్టీకుడు
గుఱ్ఱపువెనకటికాళ్ల తెగవేయుట. }

ఘనమగు యేనుగక్రిందితొట్టిలో గలమాష్టీకుడును
కనుగొనిగుఱ్ఱముపెనకకాలొకటి కత్తితోనరకగను

తెగవేయంగనుమూడుకాళ్లతో తెగువతో గుఱ్ఱమును
మెగసీదండు పైపడనప్పుడతండెనసి కత్తితోను
పొడిపొడిజేయుచు దండులనెల్లను పోడిమి జేయుచును
వడిగ కత్తితో తుండ్లుజేయుచును వదలక దిరుగుచును
అప్పుడు దేసింగుండున బాబును అంతజూచివచ్చి
తప్పక బారాహజారి కప్పుడు తగుచిమటాయిచ్చి
అంతట గుఱ్ఱము ముందరి కాళ్లను అటయేనుగ తలను
గంతు వేసి పెట్టిన మాష్టీకుడు కడు వడితో డుతమ
ఘనమగు గుఱ్ఱపుకాళ్లనప్పుడు కత్తిచేత రెండు
తునకలుగా రెండవ కాలును వడి తుండించగ రెండు
పడి వెనకటి పదములు దెగనంతట బారహజారియును
వడిగా గూలిగిన దేసింగుడుగని వాజిని ధుమికియును
కనలుచు గన్నులు యెఱ్ఱ జేయుచును కడు కోపంబునను
తన చేతుల కత్తులు దూసుకొని తన గుఱ్ఱము నటను
సరగున రెండు తుండ్లుగ నరికి చాలను గ్రుడగుచు
బరువడి దండున పాదచారియై చొరబడి పొగరడచు
గరగర దిరుగుచు కత్తులు విసరుచు కినిసియు నరకుచును
తరిమి వేయుచును తలలు గొట్టుచును దర్పము జూపుచును
పసచెడి కొందరు పారిపోవగని పకపక నవ్వుచును
రసికలయిన యావీరులదరుముచు రంకెలు వేయుచును
మెండుగ నరికి కండలు ప్రేవులు కొండలపొడవునను
ఖండించిన మొండెంబులు తలలును తుండంబులుగాను
వేయి యేనుగుల నొక్కసారిగా వేమరు నరుకుచును
వేయి గుఱ్ఱముల నొక్కసారిగా వెసబడ వేయుచును
వేయి రౌతులను నొక్కసారిగా విసరటుకొట్టుచును

నా యెడనున్న శూరుల బట్టి చయ్యన జంపుచును
ఒక్క సారి వెయికత్తులు దాతని యొక్క కత్తితోను
చక్కగ పోడిమి చెడి జనులందరు వెక్కసపడగాను
నిబాయించలేకను దండచ్చట నిలువక బారగను
నబాబు తన పాళెంబున దాగెను నంత భయంబునను
నలుదిక్కుల దేసింగుడు జూడగ నంతట నందరును
వెల వెలబోవుచు పారిపోవగను వేసరి జూచుచును
పారిపోయెడివారిని జంపుట పాపంబనుచూను
దారితప్పి దాగిన నెదిరించుట ధర్మము కాదనెను
సరగున నన్నాక శూరుడయిన మరి చంపడాయె నిపుడు
బరువడి వాంటిగ నేనెటువ్రారికి పరగబోదు నేడు.

దేసింగు సేనలు శిథిలమైనది జూచి
తన ప్రాణము విడుచుటకు నిశ్చయించుట.

మహమత్ ఖానుడు జమేదారులును మరి పినతండ్రియును
సహా గా బారాహజారిదంపతో సమసిపోయిరికను
రయముగ నా ప్రాణములింకేటికి రంగనాథస్వామీ
ప్రియముగ నీ పాదముల జేర్చునను రంగనాథస్వామీ
దాసుడనన్ను నీ సన్నిధిని దనర జేర్చు స్వామీ.
వాసిగ నిను నెర నమ్మినవాడను వచ్చి బ్రోవు స్వామీ
నా క్రమంబు నీకెరుగించితిని రంగనాథస్వామీ
చక్రము బంపుము వేగ మెహారు సరగ రంగస్వామీ
అనుచు ప్రాణములు పోగొట్టుటకు నంతె నిశ్చయించి
తనమనంబునను రంగస్వామిని తప్పక నపుడుంచి
పద్మాసనమున గూర్చుండెను తా బరువడి దేసింగు
పద్మాక్షు డగు సూర్యుని జూచుచు పల్కెను దేసింగు

నేనురంగనికిభక్తుండయితే నిజముగానుయిపుడు
నేనుశూరసింగునిసుతుడయితే నిజముగానయిపుడు
నేనుసత్యమునుతప్పకయుండిన నిజముగానయిపుడు
నేనుయేకపత్నీవ్రతుడయితే నిజముగానయిపుడు
నేనుశూరుడయితేయీకత్తీ నిజముగానుయిపుడు
పూనికతో నారొమ్మునవాటి పొసగచంపునేను
అనుచుకత్తితానెగరవేసిరొమ్మపుడుజూపగాను
ఘనమగుకత్తియురొమ్మునవాటి కదసిదూరెవెసను
హరిహరియనుచునుప్రాణమువిడిచెను అప్పుడుదేసింగు
సరసిజాసియనిప్రాణమువిడిచెను చయ్యనదేసింగు
అపుడునబాబుదండుననుండి యతిశీఘ్రముగాను
నిపుణుడయినదేసింగునిపాటు నెనసిచూచుటకును.

## దేసింగు కళేబరంబునుజూచి నబాబువ్యసనముజెందుట.

దండుతోడనునబాబప్పుడు దగ్గరికినివచ్చి
పండితుడగుదేసింగునిజూచి బహువ్యసనముమించి
యేనుగుపయిననుండునబాబు తానటుదిగివచ్చి
ప్రాణముపోయినదేసింగునితా బరువరినటుజూచి
కూర్చుండియుదేసింగునిజూచి కొంతవగచివగచి
జేర్చియతనిముఖమునతనముఖమును మూర్ఛపోయిలేచి
బాలుడదేసింగయ్యావాతో పలుకవేమియిపుడు
చాలయలసినిద్దురపోయెదవిం తేఁవచ్చెనేడు
యింతశూరుడనితెలిసితెనేను యిప్పుడుదేసింగు
యింతరాజ్యమునుయేలమనుచునీకిత్తురదేసింగు
చెలగయింతకార్యంబనితెలిసితె చెంజిపయికవేను

తలచను యెందుకు యుడిగితినిన్ను తగవు మాలి నేను
మాటిమాటికిని ముద్దు బెట్టుకొని మరిమరి వగచును
సూటిగ దేసింగునిశ్శృంగారము చూచియు నేడ్చుచును
పాపిమైతి నేనీవు చచ్చుటకు బాలుడ దేసింగు
పాపపునిందలు పడితినిభువిలో బాలుడ దేసింగు
లక్ష యేను గులునీ చేముడి నెను యీ క్షణంబులోను
లక్షణమగు గుఱ్ఱంబులు నాలుగు లక్షలు నీ చేను
సమ నెకోట్లసంఖ్యలు జనములను సరగున నీ కీతి వే
క్రమముగ నీకత్తికి సరి లేకను కదసియు తిరిగితి వే
తడయక నబాబువగచుచునుండగ దగ్గరివారెల్ల
తొడిబడి మూర్ఛల జెందుచునందరు దుఃఖపడుచునల్ల.

> నబాబు బంగార్నాయునిజూచి బంగారుపల్లకిలో
> దేసింగునుంచి చెంజికి యెత్తించుకబొమ్మని
> సెలవొసంగుట.

ఉండ నబాబు బంగార్నాయని యొప్పగానుజూచి
మెండుగ బంగరుపల్లకిదిండ్లును మెత్తలు దెప్పించి
చెలువుతొ దేసింగునినందుంచి చెంజికీని నేడు
జలిదిగ నీవును తొండ్రమల్లుడును జమేదారులిపుడు
పల్లకి నెత్తించుకపొమ్మన్నను బంగార్నాయుడును
మెల్లగ దేసింగుని యెత్తియు నా పల్లకిలో పలను
పెట్టియప్పుడు బహుజాగ్రతతో నట్టేభుజంబులను
పట్టుపట్టుడని యెత్తుకపోయిరి పరగ చెంజికటను
ముందుగ తొండ్రమల్లునిబంపి యందు రాణితోను
సందడి సేయక సమాచారములు జలిది చెప్పమనెను
త్రొందరపడుచును చెంజికిపోయి తొండ్రమల్లుడును

అందునున్న దాదులతో జెప్పగ నంతటవారలను
దేసింగునిపాటంత రాణితో తెలియజెప్పగాను
వాసితప్పియారాణియప్పుడు వారితోడననెను
ముందుపోటుతగిలితె తెమ్మనుము ముఖ్యముగానిటను
అందువెనకపోట్లైతే తేవల దండెనిలువుమనెను
రొమ్ముపోటుతగిలినదని జెప్పగ రమ్మనిసెలవిచ్చి
సమ్మతముగ తననాథునిజూచి చాలగదుఃఖించి
యున్నవారుహల్లకినటువదించి యొప్పగనందరును
మన్ననమనప్రాణములతో విడిచితె మనముపోదమటను

## రాణి దేసింగునిజూచి చింతాక్రాంతయై దుఃఖించుట.

రాణియంత బహుదుఃఖముతో తన ప్రాణనాథుజేరి
మాణిక్యమనాప్రాణసఖ్యమా మరియనిన్నుకోరి
పెండ్లిచేసుకొని యేమిసుఖంబుల ప్రీతినమభవిస్తి
కండ్లనిన్నుజూచుట కేసికడ గండ్లనోమునోస్తి
నావద్దికినీవొచ్చినప్పుడే నరసిప్రాణనాథా
పోవద్దనినే నెంతో జెప్పితిని పోసగప్రాణనాథా
వినకపోతివిక నేమిసేయుదును వైత్రిని జేసితివె
వెనకనింకనా కెవ్వరుదిక్కు వ్యర్థగా జేసితివె
అనితననాథునిపైబడి రోదించుచు నెడబడిమూర్ఛిలుచు
ఘనుడగు దేసింగునిరూపంబును కనుగొనివగగొనుచు
జూడవచ్చినవారలెల్లరును జూచిమోదుకొనుచు
తోడువచ్చిన దాదులజూచుచు గోడుచెప్పుకొనుచు

అంబరంబునకు నెగరగ రత్నము లంతజారి దిట్టి
చుట్టుబడ్డయారత్నము లెల్లను సొంపుతోడ జనులు
అట్టిమెత్తుకొని సంతోషంబున నలరిరంత ప్రజలు
నాథుని గుండంబుననుంచియు తా నంత సమ్మతించి
సాధుల కెల్ల నమస్కరించితా సరగ నగ్నిజూచి
భావంబున శ్రీహరిహరియనుచును పరగ సంతసించి
దేవుండయిన యగ్నిహోత్రుని తేజమునకు మ్రొక్కి
నారాయణ శ్రీకేశవ యనుచును అంతనగ్ని జొచ్చి
సాహసుడ్రీపరమేశా యనుచును సరసతోడ జొచ్చి
ఉన్నంత నయా దేవవిమానము నొప్పగాను రాగ
సన్నుతులగు యాదంపతులిద్దరు స్వర్గమునకు నేగ
పుష్పవిమానంబచట నప్పుడును పొందుగ దేవతలు
పుష్పవర్షములు గురియించుచును పొగడిరంత మేలు
అని నారదముని దేసింగునికథ నంత దెలుపగాను
విని సురనాథుడు సంతసించెను వేడ్కమీరగాను
సరిగున నారదుడంతట లోకసంచారముగ యికొనెను
గరిమతో నేగిరి దేవతలెల్లను కడుముదమందగను
శూరుడయిన దేసింగునికథను సొంపుగ నెవరయిన
సాహసుడ్రాసిన చదివిన విన్నను స్వారస్యముగ వినిన
పుత్రపౌత్ర భాగ్యంబులు గలిగి పొందుగాను వెలసి
గోత్రవృద్ధియును శత్రునాశనము కోరికెలను వడసి
ఆయుర్వృద్ధియు శ్రేయస్కరము ను అధిక సంపదలను
బానుక నెప్పుడగలుగు మావారికి బహుభోగంబులను

ఆచంద్రార్కస్థాయిగనీకథ అతిశయంబుగాను
భూచక్రంబుననుండఁగవలెనని పొందుగఁగోరెదను
విరచించితిదేసింగురాజుకథ వీనులవేడుకను
సరగునదిద్దుఁడుసద్బుధులెల్లను సంభ్రమంబుతోను
సామాన్యముగాఁజెప్పితినీకథ స్వారస్యముగాను
రామార్పణముఁగఁజేసితినిప్పుడు రమణీయంబుగను.

దేసింగురాజుకథ.

సంపూర్ణము.